శ్రీరస్తు.

శ్రీకృష్ణాయ నమః.

# పండితాభిప్రాయమణిమాలిక.

## पण्डिताभिप्रायमणिमालिका

ఇది

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి

ఆంధ్రదశరూపకము నుద్దేశించి ప్రవర్తించినది.

శ్రీ శారదాంబావిలాసముద్రాక్షరశాలయందు

ప్రకటింపఁబడినది.

# భూ మి క.

మహనీయులారా !

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమయాంధ్రదశ
గ్రంథమును శ్రీమ జ్జటప్రోలుసంస్థానాధీశ్వరులసన్నిధికిఁ బంపి
నపైని శ్రీవారు దానిని బండితులవలన నవధరించునపుడు తోఁచిన
యములను గూర్చి మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారికి వెల్లాల
శివశాస్త్రిగారికి జరగిన చర్చ యంతయు శ్రీమ త్ప్రభువర్యుల
న్నిధ్యమునసే జరగిన దనియు సూర్యనారాయణశాస్త్రిగారు
కు సదాశివశాస్త్రిగారికి జరగినవాదములను బండితులకు వ్రా
చి వారలయభిప్రాయములను బట్టి మావాదములలో సామంజస్యా
ంజస్యములు నిర్ధారింపుఁ డని శ్రీవారిసన్నిధికి విన్నప మంపికొను
న శ్రీవారు దయచేసి యుభయవాదములను ముద్రింపించి పండి
కనిచి రనియు నాంధ్రదశరూపకవిమర్శాదిగ్రంథములమూల
ఁ దా మిదివఱ కెఱింగినవిషయమే కదా !

అందుపైని పెక్కండ్రు ప్రఖ్యాతపండితులు, మహామహోపా
యులు, ప్రిన్సిపాలురు, తత్తదాస్థానవిద్వాంసులు, స్వస్వాభిప్రాయ
ను శ్రీమ త్ప్రభుపుంగవులసన్నిధానమున కంపికొనిరి. అగ్రిమ
ఖమూలమున నవియెల్లఁ దెల్లం బగును.

మఱియు మల్లాదివారు తమఖండనపత్రము తుదిని స్వసిద్ధాంత
మయిన "దూతి నభిసరింపఁ జేయుటయే ద్వితీయాభిసారికాలక్షణార్థ
టను గూర్చియు అనుకార్యపదము నటపర మనుటను గూర్చియు,
ఖమున స్వాధీనపతికాలక్షణమునకు వాసకసజ్జయం దతివ్యాప్తి తే
టను గూర్చియు" ననుమోదకులుగాఁ బ్రకటించిన శ్రీ జయంతి
పయ్యపంతులు బి. ఏ, బి. ఎల్, గారు, శ్రీ చేట్లూరి వేంకటసుబ్ర

హ్మణ్యశాస్త్రిగారు, శ్రీ మరువాడ శంభన్నశాస్త్రిగారు, శ్రీ పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారుగూడ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారివాదము సరియైనది కాదని వ్రాసి పంపిరి. కనుఁడు వారలు వ్రాసినవిధమును. శ్రీవేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, "రసము నటనిష్ఠ మని నేను చెప్పినట్టు సూర్యనారాయణశాస్త్రిగారు వ్రాయడం పొరపాటు. స్వాధీనపతికాలక్షణములో మీరు వ్రాసినదోషములు దోషములు గా వని నేను చెప్ప లేదు" అనియు, "విమర్శములో మీరు వ్రాసినయాక్షేపములన్నియు సరియైనవే కాని వేఱు కాదు. ఆంధ్రము చేయుటలో అర్థము తెలిసిన్ని పొరపాటుగా వ్రాసినతప్పులు కొన్ని అర్థము సరిగ్గా తెలియక పొరపాటుగా వ్రాసినతప్పులు కొన్ని విపరీతార్థజ్ఞానముచే వ్రాసినవి కొన్ని తప్పులు" అనియు వ్రాసిరి.

శ్రీ జయంతి రామయ్యపంతులుగారు "లాక్షణికులందఱును బూర్వోదాహృతవాక్యమునకు నాయకుని రప్పించుకొనుటయే యర్థము చెప్పి యుండిరి గనుకను, దూతిని బంపుటచేతనే కామార్తురా లగు నాయిక చరితార్థురాలు కాఁజాలదు కావునను, సారయే త్తనఁగాఁ గాంతుని రప్పించుకొనుట యనియే యర్థ మని చెప్పవలసి యున్నది. ఈ నాయభిప్రాయమును సూ-శాస్త్రిగా రెఱుంగుదురు" అని వ్రాసిరి.

శ్రీ పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "సూర్యనారాయణీయ విసర్గ సాహసేన పరం విస్మయమానానా మస్మద్గురుచరణానా (శ్రీమరువాడ శంభన్నశాస్త్రివర్యాణామ్) మనుమత్యైవ కించి దద్య లిఖామః. సూర్యనారాయణశాస్త్రిలిఖితాంధ్రదశరూపకే, (౧) అనుకార్యరామస్య అనుకర్తృ నటపరతయా లేఖన మతి సాహసమ్. (౨) తద్దర్శనశ్రవణశృంగారదర్శన ఇతి సూ-శాస్త్రిణా మపి నష్టమ్. తథాపి అంతరధర్మస్య వ్యాచాక్షుమస్య శృంగారాదిరసస్య ప్రతీయమానతాయాం నకోపి వివదేత. ఏతాదృశస్థలే సూ-శాస్త్రిణాం వదతో వ్యాఘాతస్స్యా దేవ. (3) అవర్తమానస్యాపి వర్తమానవ దవభాసన మి

ప్యత ఏవేత్యత్ర తచ్ఛబ్ద బలాదపి దాశరథి రేవ రసాలంబన న్నహి నట ఇత్యేవ ప్రతీయతే. (౨) సత్పురుషాణాంచ లజ్జేత రేషాం త్వసూయాదయః. ఇత్యత్ర ఆంధ్రే ఇతరపదపరిహారః నాన్వేతి ధనికాభిప్రాయమ్ ” ఇత్యాదిగా లిఖించిరి. ఇదియు శ్రీమరువాడ శంభన్న శాస్త్రుల వారియభిప్రాయము గూడ.

శ్రీ శ్రీ ప్రభువర్యులు వీని నన్నింటిని బరిశీలించి పరిష్కరింపఁ ండితసభ కొసంగి “ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి దశరూపకాంధ్రీకరణము, తన్నిర్వాహార్థమై వారు చేయువాదమును, సమంజసములు గావు ” అని యాపండితమండలి చేసినతీర్మానమును మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారికిఁ దెలియఁజేయ నాజ్ఞాపించిరి.

నేను నాయాపండితసార్వభౌముల యభిప్రాయసూక్తిముక్తామణుల నెల్లం గూర్చి దేదీప్యమానం బగు నీపండితాభిప్రాయమణిమాలను, సహృదయహృదయాలంకారంబుగాఁ బ్రకటించి కృతకృత్యుండ నగుచున్నాఁడను.

వె - సదాశివశాస్త్రి.



శ్రీ

# అభిప్రాయానుక్రమణిక.

సంఖ్య. పుటసంఖ్య.

సంఖ్య. | పుటసంఖ్య.

శ్రీరస్తు.

శ్రీకృష్ణాయ నమః.

ఆంధ్రదశరూపకవిమర్శము

# పండితాభిప్రాయములు.

మద్రాసు గవర్నమెంటు ప్రెసిడెంసీకాలేజీ సంస్కృతవిద్యాప్రొఫెసర్ బ్రహ్మశ్రీ, యస్. కుప్పుస్వామిశాస్త్రి యం. ఏ. గారి యభిప్రాయము.—

Mr. Vellala Sadasiva Sastri Garu gave me an opportunity to see his criticism of the Andhra Dasarupakamu by Malladi Suryanarayana Sastri. I am perfectly satisfied that Mr. Sadasiva Sastri's criticism is quite fair and based upon an accurate knowledge of the contents of Dhananjaya's Dasarupakam in Sascrit and that the Andhra Dasarupakamu by Suryanarayana Sastri which is said to be a Telugu rendering of the Sanscrit Dasarupakam exhibits many imperfections and in numerous instances it gives an utterly inaccurate and completely distorted version in Telugu of the ideas contained in the Sanscrit original. I have no doubt that the Andhra Dasarupakamu will do more harm than good to the Telugu readers ignorant of Sanscrit and would never enable such readers to find access to the thoughts contained in the Sanscrit Dasarupakam.

(Sd.) S. KUPPUSWAMI SASTRI, M. A.,
Proffessor of Sanscrit and
Comparative Philology,
Presidency College, Madras.

Mylapur.
8—7—1917.

శ్రీయుత - వి. కృష్ణస్వామయ్యర్ గారి సంస్కృతకలాశాల ప్రిన్స్‌పాల్ మహామహోపాధ్యాయు లగు, బ్రహ్మశ్రీ ఆర్. చంద్రశేఖరశాస్త్రి గారి యభిప్రాయము.—

I Quite agree with Proffessor Mr. S. Kuppuswami Sastri, M. A., in passing remarks on the Telugu rendering of Dasarupaka by Malladi Suryanarayana Sastri.

Sanscrit College
Mylapur.
23—7—1917.

(Sd.) Mahamahopadhyaya
R. CHANDRASEKHARA SASTRI,
Principal.

శ్రీయుత - వి. కృష్ణస్వామయ్యర్ గారి సంస్కృతకలాశాలయం దధ్యాపకు లగు, బ్రహ్మశ్రీ శ్రీనివాసశాస్త్రిగారి యభిప్రాయము.—

"సన్తు నమాంసి శ్రీమద్భ్య స్సదాశివశాస్త్రిభ్యః. భవద్భిః ప్రహితం పుస్తకత్రయ మవాలోకి. తత్రచ ప్రాథమిక మాంధ్రదశరూపకం భవదీయవిమర్శోక్తాభి రనుపపత్తిభి ర్న వినాభవత్యేవ. తృతీయంతు తత్ఖండనం నఖండయతి భవదీయం విమర్శమ్. నవాపోషయతి తన్మూలభూత మాన్ధ్రదశరూపకమ్. అత శ్చైవ మ్మన్యామహే. అయ మాంధ్రదశరూపకకృత్ ఆలంకారికసాధారణీం సహృదయతాం విమర్శే ష్వవిముంచన్ భవద్విమర్శనిర్దిష్టే ష్వపి ప్రామాదికస్థలేషు స్వీయ గ్రంథం సమీకృత్య ప్రచారయతి చే న్మహదుపకృతం స్యా దాంధ్రభాషాభిజ్ఞానా మలంకారవ్యుత్పిత్సూనా మితి.

౫-౭-౧౭.
చెన్నపురీ.

చెన్నపురసంస్కృతకలాశాలాయా మధ్యాపకః,
శ్రీనివాసశాస్త్రీ.

మద్రాసు రావుసాహేబు కలవల కణ్ణన్ శ్రేష్ఠిగారి సంస్కృతకలాశాల యందు అధ్యాపకు లగు, ౧. శ్రీమాన్, ఈ- గోవిందాచార్యుల యొక్కయు, ౨. శ్రీమాన్, సో - నరసింహాచార్యులవారియొక్కయు, 3. శ్రీమాన్, ఆర్ - శేషశాయి అయ్యంగార్ వారియొక్కయు నభిప్రాయములు.—

సటీకస్య దశరూపకస్య యదాంధ్రీకరణం యశ్చతద్విమర్శః యదపి తత్ఖండనం తత్సర్వమేవ సువిమృష్టం - తతశ్చేయం చింతా సమజాయత - అహోబత లౌకికవదనపిధాననిపుణ స్యాంధ్రకవే రాంధ్రీకరణచాతుర్యం - యద్దశరూపకస్య సవ్యాఖ్యస్య క్వచి త్తాత్పర్య మేవాగృహ్ణాన్ క్వచిచ్చ వ్యాఖ్యానమేవ స్వానురోధే నాకర్షన్ కిం బహునా సర్వథా గురుముఖా ల్లక్షణగ్రంథార్థగ్రహణం వినైవ ఏవంవిధమాంధ్రీకరణం ముగ్ధజనాంధీకరణం విరచయ్య తద్దోషప్రదర్శనే ష్వనాదరమేవ ముఖ్యం ప్రతివిధాన మ్మన్వానో విజయత ఇతి.

తథాహి - అభిసారికాలక్షణే కవి రయ మాంధ్రః దృఢప్రమాదఏవ సన్నపి బాలప్రతారణీభి ర్యుక్తిభి గ్గ్రంథార్థ మపలపతీతి విమర్శే సుస్పష్టమ్.

స్వాధీనపతికాలక్షణార్థస్య సమగ్రస్య అననుసంధానేన వాసకసజ్జాయా మతివ్యాప్తం లక్షణ మభిదధౌ.

మాధుర్యగుణలక్షణే మహాక్షోభజనకసామగ్రీ సమవధానేపి యః శ్లక్ష్ణోవికార స్త న్మాధుర్య మిత్యత్ర యోజనాయా మాంధ్రోయం వికారపదార్థే మాధుర్యత్వ మసహమానః శ్లక్ష్ణపదార్థం చాజానానోన్యతోవా నిర్వికారత్వం మాధుర్య మిత్యాహ - నైతత్ గ్రంథతో యయా కయాచనాపివిధయా లభ్య మి త్యయుక్తమ్.

ధీరోద్ధతాది నాయకానాం తత్రతత్రరూపకేషు శాంత్యాద్యవస్థాంతరాభిధానా సంగత్య మాశంక్య తస్య ముఖ్యనాయకవిషయతయా సమాధానం తస్మిన్నర్థే ఛద్మనా వాలివధరూపస్య అమహాసత్త్వతా

పాదకస్య అవస్థాంతరస్యాభిధానం ప్రదర్శనంచ ధనికకృత మగృహ్ణన్ ప్రధాన స్యాపినాయకస్య కథాదిస్థిత్యానుగుణ్యే నావస్థాంతరపరి గ్రహో యుజ్యత ఇత్యర్థకం కథయ న్నాంధ్రః కియ ద్భ్రామ్యతీతి నజానీమః.

అయోగో విప్రయోగశ్చేతి శృంగారవిభాగవ్యాఖ్యాయాం మహ్యటాదిభి స్సంభోగవిప్రలంభభేదేన విభజనా దన్యథావిభాగా నౌచిత్యమాశంక్య-తథాచేత్ విభజ్యేత విభాగవాక్య మిద మపరిపూ ర్ణార్థం భవేత్ విప్రలంభశబ్దస్య వంచనపర్యాయతయాదైవికసంశ్లేషా భావస్య అన్యవిధస్యా ప్యసంగ్రహాత్ నచ విప్రలంభశబ్దఏవ భవద భిమతార్థం బోధయతీతి వాచ్యం ముఖ్యవృత్త్యా వంచనమాత్రపరస్య తస్యాన్తరేణోపచారం వివక్షితయావదభిధానాసామర్థ్యా దిత్యర్థక ముక్తం ధనికేన.

తత్రాయ మాంధ్రః సంశ్లేషాభావత్వవ్యాప్యం విప్రలంభత్వ మితి హేతోర్వ్యాప్యేన వ్యాపకక్రోడీకారో నఘటత ఇతి ధనికతా త్పర్య మజానన్ మాభూ దిత్యుత్తరగ్రంథం మహ్యా ఉపనుదన్ సామా న్యాభిధాయిత్వమేవ విప్రలంభశబ్దస్యేతి భ్రామ్యన్ అయోగవిప్రయో గయో ర్భేదప్రతిపత్తి మసంబద్ధామనుపపన్నాం చ ఫలయన్ విప్ర లంభపదగ్రహణ పూర్వకవిభాగాకరణ మాహేతి నాకలయామోస్య కూపా త్క్వాపపతనమ్.

ధీరోదాత్తలక్షణవ్యాఖ్యాయాం నాయకసామాన్యగుణతయో పాత్తానాం స్థైర్యాదిగుణానాం నాయకవిశేషలక్షణే గ్రహణ మనుపయు క్త మిత్యాశంక్య విశేషలక్షణేషు పునరుపాదానం సర్వసాధారణతయో పాత్త స్థైర్యా ద్యపేక్షయోత్కర్షవదితి బోధనాయే త్యర్థకముక్తం ధనికేన.

ఆంధ్రస్తు కవిః అత్రాంతరే కథావిశేషేషు దత్తదృష్టిః లక్షణే సంకీర్తన మితిపదార్థమనాకలయన్ విశేషతః కీర్తనమాత్రమేవ పరిగృ

ధ్యావిశేషతః స్థైర్యాదిగుణవర్ణనప్రవణస్య కవే రాశయముద్ఘాటయన్
ధనికగ్రంథో మయా ఽఽంధ్రీకృతఇత్యభిప్రయన్ కథముపహాసనీయ
ఇతి లక్షణలక్ష్యభావవిజ్ఞానరాహితీమోహిత మేనం పర్యాలోచ్య
సహృదయా ఏవా కలయంతు.

ఏవ మేవ చాస్యాంధ్రకవే ర్దశరూపకాంధ్రీకరణం బహుత్ర
పదార్థాపరిజ్ఞాన భ్రమ దురాగ్రహ ప్రభృతిదోషగణదూరోత్సారిత
ధనికతాత్పర్య మేవ వర్తత ఇతి, కేషాంచి ద్దూషణానాం బాలసుగ
మతయాచ, కిమత్ర బహుధా లేఖనీవ్యాపారేణేతి నివర్తయామో
మరర్థానువాద తన్నిరసనాని.

ఇతి చన్నపుర్యాం రావుసాహేబు కలవలకణ్ణన్ శ్రేష్ఠి ప్రతిష్ఠా
పితాయాం సంస్కృతకలాశాలాయాం అధ్యాపకాః.

5-7-1917.

ఈ. గోవిందాచార్యః.
సో. నరసింహాచార్యః.
ఆర్. శేషశాయి అయ్యంగార్.

మద్రాసు పచ్చయప్పకాలేజీలోని సంస్కృతపండితు లగు మహామహో
పాధ్యాయ మహాకవి కే. వి. లక్ష్మణసూరిగారి యభిప్రాయము.—

"భవద్భిః ప్రేషిత మాంధ్రదశరూపకవిమర్శాఖ్యం భావత్కం
కావ్యం సాదరం పర్యగ్రాహి. పర్యైక్షిచ స్థాలీపులాకన్యాయేన త్రిచ
తురేషు ఘట్టేషు. తత్ర మూలభూతస్య సవృత్తికస్య దశరూపకస్య
శ్రీమ త్సూర్యనారాయణశాస్త్రియా వివృతి ర్మూలగ్రంథం భవదీయ
విమర్శం వా అసమీక్షితవతాం నాటకాలంకారాదివ్యవస్థాగ్రంథే
ష్వనాకలితచర్చానాం చ చారుత రైవ భవతి.

భవదీయవిమర్శకావ్యం తు బలవ త్తత్ర సంస్కృతబుద్ధీన్
కేవల మామోదయతి. తథాపి యే జిజ్ఞాసవ ఆంధ్రభాషామాత్రాభిజ్ఞాః
తేషాం శ్రీమ త్సూర్యనారాయణీయగ్రంథే విభ్రాంతికరణేన జగతి

వ్యుత్పిత్సూనా మన్యథాగ్రహో మాభూ దితి కృత్వా ఏతం విమర్శ గ్రంథం విరచయ్యద్భి ర్భవద్భి రాంధ్రభాషా మభ్యస్యతాం మహా నుప కారః కృత ఇతి నితరా మనుమోదామహే భవదీయమిమ ముద్యమమ్. విలసంతుచ భవద్భ్యో ఽమీ ప్రణామా ఇతి శమ్.

12-7-1917. కే. వి. లక్ష్మణసూరి.
సంస్కృతపండితుఁడు, పచ్చయప్పకాలేజి, మహా మహోపాధ్యాయుఁడు, అండ్ మహాకవి.

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారొసంగినయభిప్రాయము.—

"తమరు జాబులో స్థాలీపులాకన్యాయానుసారమున వ్రాసిన యాక్షేపములను జా బందినదినమందే కని ఆయాక్షేపములయత్యంత సాధుత్వన్యాయ్యత్వములు స్వతఃప్రకాశమానములై యుండియు విచికిత్సాగోచరము లైనందులకును, అట్టియాక్షేపము లందినపిమ్మట నైనను తద్గ్రంథరచయిత తనయనధికారిత నెఱింగి ముద్రిత మైనయా గ్రంథమును పరహస్తగతము కాకుండునట్లుగాఁ జేసికొని ప్రాజ్ఞులకడ మూలమును చక్కఁగ నేర్చి అనంతరము వెండియు నాంధ్రీకరించి ఆ రెండవమాఱు సాధుత్వమును అలవరించుకొనుటకు మాఱుగా మీ యందు దురాక్షేపకత్వము నారోపించుట యీకాలపుగ్రంథకర్తల చర్యకు అవిరుద్ధముగానే యున్నది కావున ఆశ్చర్యమేమియు లేదు గాని యుత్కృష్టమైనయాలంకారికప్రమాణగ్రంథము ఈయాంధ్రీకరణములో అంధీకృతమైనందులకును, మనమున మిక్కిలి చింత గల్గియున్నది. అనధికారికృత మైనయాగ్రంథమును ఒప్పరికించి ఇందువలన భావ్యాంధ్రగ్రంథకర్తలు బావిలో పడ కుండునట్లుగా అధికారు లైన వారు దీనికి (దశరూపకమునకు) సరి యైనయాంధ్రీకరణము చేయుట లోకోపకార మగు నని తలపోయు చున్నాఁడను."

13-10-1915. వేదము వేంకటరాయశాస్త్రి.

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు గతసంవత్సరము కడపలో జరగిన యాంధ్రసాహిత్యపరిషత్సమావేశమునందు సభలో వెల్లడించిన దశరూపకోక్తాభిసారికాలక్షణవాక్యార్థపరిష్కారము

దశరూపకమందు, "కామార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" యథామరుశతకే—"ఉరసి నిహిత స్తారో హారః కృతా జఘనే ఘనే కలకలవతీ కాఞ్చీ పాదౌ రణన్మణినూపురౌ। ప్రియ మభిసర స్యేవ ముగ్ధే త్వ మాహతడిండిమా యది కి మధికత్రాసో త్కంపా దిశ స్సముదీక్షసే. యథాచ - నచ మేవ గచ్ఛతి యథా లఘుతాం కరుణాం యథాచ కురుతే సమయి। నిపుణం తథైన ముపగమ్య వదే రభిదూతి కాచి దితి సందిదిశే" మాఘ. ౮—౫౬.

అమరుకమందు, "ఉరసినిహిత" ఇందులకు వేమభూపాలటీక. "హిత్వా లజ్జాం సమాకృష్టా మదనేన మదేనచ। యాభిసారయతే కాంతం సా భవే దభిసారికా" సారయత ఇత్యత్ర స్వార్థణ్యన్తః.

దర్పణమందు, "అభిసారయతే కాంతం యా మన్మథవశంవదా। స్వయం వాభిసర త్యేషా ధీరై రుక్తాభిసారికా". క్రమా ద్యథా - నచ మేవ గచ్ఛతి......"ఉత్తిష్ఠ త్వంకర......"

దశరూపకమునుండి యుద్ధరించిన పైలక్షణవాక్యములో, "సారయే" త్తనుచో "దూతీం సారయే" త్తని నవీనులు కొందఱు టీకించినారు అది సాధువు కా దనియు, "కాన్తం సారయేత్" అనఁగా "కాన్త మభిసారయేత్" అని వాక్యపూర్తి చేసికొనవలయు ననియు పైసంవాదములచేత స్పష్టపడుచున్నది. మఱియు, దూతీప్రేషణమే అభిసారికా లక్షణ మేని, ఈక్రిందియుదాహరణమున నాయిక కలహాంతరిత యెట్లగును ?

మాఘమందు, "అథ కాచి త్కలహాన్తరితా కాన్తం ప్రతి త్రిభిర్దూతీం సందిశతి" అని యవతరించిన 3 శ్లోకములలో మూఁడవది, "శ్లో॥ తదుపేత్య మాస్మ త ముపాలభథాః కిల దోష మస్య నహి

విద్మ వయమ్ । ఇతి సంప్రధార్య రమణాయ వధూః విహితాగసే౽పి విససర్జ సఖీమ్". టీకయందు "ఏషా కలహాన్తరితా ప్రౌఢాచ" అని యుపసంహారము. ఇట్లయిన మల్లినాథసూరి పూర్వోదాహృత "నచ మే" శ్లోకమును, "కాచి న్నాయికా దూతీం వాచిక మనుశాస్తి" అని యవతరించి, టీకలో, నాయికాతు కలహాన్తరితా, "కోపా త్కాంతం పరానుద్య పశ్చాత్తాప సమన్వితా ఇతి లక్షణాత్" అని యుపసంహారము చేసినాఁడు. దీని నభిసారికోదాహరణముగా ధని కాదులు కొని యుండఁగా కలహాంతరిత యని యీయన వ్రాయుట యెట్లు సంగతపడును? ఇం దేమి మతద్వయమా?

ఇందు నాయకునిం దోడితెమ్మని తాత్పర్యమేని నాయిక యభిసారిక యగును. ఒండుచో కలహాంతరిత యగును. ఈ తాత్పర్యభేదముంబట్టి పైనాయికాభేద మేర్పడినది.

కావున దూతీప్రేషణమాత్రము అభిసారికాలక్షణము గా నేరదు. మఱియు మాఘకావ్యమునందు ఈఘట్టమున కలహాంతరిత నాయికలపంపున దూతికలును సఖులునుం బోయి నాయకులను మంచిమాటలం దేర్పుడు వారు నాయికలకడకు వచ్చి రని చెప్పఁబడి యున్నది. "దయితాహృతస్య యువభి ర్మనసః పరిమూఢతా మివ గతైః ప్రథమమ్ । ఉదితే తత స్సపది లబ్ధపదైః క్షణదాకరేనుపదిభిః ప్రయయే" ఇట నీఘట్టమునం దోడితెమ్మనియేని రమ్మనియేనియు లేకున్నను, ఇట్లు దూత్యుక్తులచే నాయకులు బెట్టువదలి నాయికల కడకు వచ్చి రనియు నున్నది గావున ధనంజయాదులు "కరుణాం యథాచ కురుతే సమయి" ఇత్యాదివాక్యములకు తోడితెమ్మనుట యందే తాత్పర్యము గ్రహించి "నచ మేవ గచ్ఛతి" శ్లోకమందలి నాయికను అభిసారికనుగా నుదాహరించి రని తలంప నగును. నాయకులు నాయికలందు అపరాధము లేమిని దూతీవాక్యములవలన నెఱింగి స్వబుద్ధిచేతనే వచ్చి రనుట తాత్పర్యముగాఁ గొని మల్లినాథ

హారి యానాయికల నభిసారికలనుగాఁ జెప్పక దూత్యము పంపుటకు మున్ను జరిగి యున్న నాయికకలహాముంబట్టి కలహాంతరితలనుంగాఁ గొనె ననియు ఉక్తదృఢీకరణము.

ప్రతాపరుద్రీయమందు, "కాన్తాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా"

టీక, అభిసారికా మాహ. కాన్తేతి. కాన్తస్య కర్మణః కర్తుర్వాఽభిసరణే ఉద్యుక్తా. అత ఏవోక్తమ్. స్మరార్తాభిసరే త్కాన్తం సారయే ద్వాభిసారికా ఇతి. సారయే దితి - దూత్యాదిముఖే నేతి శేషః. ......అత్ర కాన్త కర్మకాభిసరణ ముక్తమ్. ఏవం కాన్త కర్తృకాభిసరణే ప్యుదాహార్యమ్.

నరసభూపాలీయమందు, "కాన్తాభిసరణ। శీల యభిసారికాఖ్యమై చెలువు మెఱయు" అని మూలము. అందులకు వింజమూరి కృష్ణమాచార్య బహుజనపల్లి సీతారామార్యు లిరువురిచేతను రచింపఁబడిన టీక. కాంతు నభిసరించునది గాని, దూతికాదులచేతఁ గాంతు నభిసరింపించునది గాని, యభిసారిక యనంబడును.

సాహిత్యరత్నాకరమందు, "అనురక్తా స్వయం యాతి కాంతం యా సాభిసారికా" ఇందుల టీకలో "అథాభిసారికాం లక్షయతి। అనురక్తేతి। స్మరార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" ఇతి ద్వివిధ మభిసరణమ్। సారయే దితి దూత్యాదిముఖేనేతి శేషః। తత్రాద్యపక్షావలమ్బనే నోదాహరతి రావణేతి.

కావ్యానుశాసనమందు, "అభిసర త్యభిసారయతివా కామార్తా కాన్త మిత్యభిసారికా" యథా। ఉరసినిహితః......, తథా "నచ మే..." ఇందును సూత్రవాక్యముం బట్టి "నచ మే" అనునది "కాన్త మభిసారయే" త్తనులక్షణమున కుదాహరణము గాని "దూతిం సారయే" త్తనునందులకుఁ గాదు.

రసార్ణవసుధాకరమందు, "అథాభిసారికా, మదనా నలస్తం

లేప్తా యాభిసారయతి ప్రియమ్, జ్యోత్స్నీతమస్వినీయానయోగ్యాం బరవిభూషణా, స్వయం వాభిసరే ద్యాతు సాభవే దభిసారికా"

రసమంజరియందు, "స్వయ మభిసరతి ప్రియ మభిసారయతి వా యా సాభిసారికా, అందులటీక వ్యంగ్యార్థకౌముదిలో, "క్రమ ప్రాప్తా మభిసారికాం లక్షయతి, స్వయ మితి, అభిసర ణాభిసార ణాన్య తరవత్త్వ మి త్యర్థః. ఉక్తంచ - యాకాన్తాభిసరే త్కాన్తం సారయే ద్వాభిసారికా" ఇతి.

దూతీం సారయే త్తనువ్యాఖ్యం బట్టి చూడఁగా,

దశరూపకమందు, "అథాసాం సహాయిన్యః, దూత్యో దాసీ సఖీ కారూ ర్ధాత్రేయీ ప్రతివేశికా, లిఙ్గినీ శిల్పిని స్వంచ నేతృమిత్ర గుణాన్వితాః" దర్పణమందు "లేఖ్య ప్రస్థాపనైః స్నిగ్ధ ర్వీక్షితై ర్మృదు భాషితైః। దూతీ సంప్రేషణై ర్నార్యా భావాభి వ్యక్తి రిష్యతే॥ దూత్యశ్చ, దూత్య స్సఖీ నటీ దాసీ ధాత్రేయీ ప్రతివేశినీ, బాలా ప్రవ్రజితా కారూః శిల్పి న్యాద్యా స్స్వయం తథా" కావ్యానుశాసన మందు, "అన్త్య త్ర్యవస్థా పరస్త్రీ, పరస్త్రీయాతు కన్యోఢే, సం కేతా త్పూర్వం విరహోత్కంఠితే, పశ్చా ద్విదూషకాదినా సహాభి సర న్త్యావభిసారికే"

ఇత్యాదిప్రమాణములం బట్టి సఖీదాస్యాదులు పలువురు దూతికలుగా నుండం దగును గావునను, దశరూపకమందలి యభిసారి కోదాహరణములయందుఁ ధనికుసివలెనే ఇంకెనపేరులు దశరూప మునకు వ్యాఖ్యలు వ్రాయుట సంభవింపఁ దగును గావునను, వారు వారొసంగెడి యాయాయుదాహరణములందు ఎవరిని బంపిన "వారి నే సారయేత్" (జాబు) లేఖము వ్రాసిన "లేఖం సారయేత్" అని లక్షణముం గల్పించుకొనవలసి వచ్చును.

దూతీం సారయే త్తను కల్పనలో దూతిని తనకు "అనఁగా నాయికకు" బదులుగా నాయకునికడకుం బంపుట యేల యర్థము గాదు?

ఇట సారయే త్తనుపదము అభిపూర్వకము గానందున "కాన్తం సారయే త్తను నన్వయము" పొసఁగ దనుట భాషాస్వభావానుగుణము గాదు. అభిశబ్దమును ఉపస్థితముగా నుండను నున్నది. లేనియుప సర్గలను సయితము తాత్పర్యముంబట్టి యూహించుకొనుట యీభాష యందుఁ గలదు.

"పలాశకుసుమ భ్రాన్త్యా శుకతుండే పతత్యళిః। సోపి జంబూ ఫల భ్రాన్త్యా తమళిం హర్తు మిచ్ఛతి" ఇట "ధర్తుమ్, హన్తుమ్" అనుపాఠములకన్న హర్తు మనునదియే శ్రేయ మనియు, హర్తు మనుటకు అభ్యవహర్తుమ్ అని యర్థ మనియు, సాంప్రదాయికులమతము. మురారినాటకములో "చేత శ్శుక్తికయా నిపీయ శతశ శ్శాస్త్రామృతాని క్రమా ద్వాంతై రక్షరమూర్తిభి స్సుకవినా ముక్తాఫలై ర్గుంభితాః। ఉన్మీల త్కమనీయ నాయకగుణగ్రామోపసంవర్ణన ప్రౌఢాలింకృతయో లుఠ న్తి కృతినాం హారేషు కణ్ఠస్రజః" అనుశ్లోకముపై రామానందీయవ్యాఖ్యలో హారశబ్దము వ్యాహారపర మని వ్రాయుటయు వ్యాజ్సంబంధము లేని హారశబ్దము వ్యాహారపర మెట్లగు నని యాక్షేపమును, వ్యాజులు లేకపోయినను బాధ లే దని సమర్థనంబును గలవు. హరిహరదీక్షితీయమందును పైవిషయ మిట్లె సమర్థింపఁబడి యున్నది. మురారి మీఁది యీవ్యాఖ్యలందు "విరమతి మహాకల్పే" అనుశ్లోకములోని కల్పశబ్దమునకు సంకల్పపరత్వము కూడఁ జెప్పఁబడి యున్నది.

కిరాతార్జునీయమున ప్రథమసర్గలో చతుర్థశ్లోకముయొక్కటీకలో మల్లినాథసూరి "యుక్తైః" అనఁగా "నియుక్తైః" అని అర్థము వ్రాసినాఁడు. ఇట్లె ఇటను "సారయే" త్తనఁగా "అభిసారయే" త్తని గ్రహించుట సమంజసము.

మఱియు నిట "సారయే" త్తనుటకు అభిసారయే త్తని యర్థము కా దనుట ఉదాహృతాలంకారికసార్వభౌములవ్యాఖ్యలకు విరుద్ధముగా నున్నది.

మఱియు "కాన్తం సారయే" త్తను నన్వయముచేత "కాంతుని రప్పించుకొనుట యనుపక్షము, అదియే అభిసారణము సిద్ధించుచున్నది. అది సర్వాలంకారికసమ్మత మని విదితమే గదా!

దూతీం సారయే త్తను నూతనాన్వయముచేత (1) దూతిని పొమ్మనుట (2) నాయక తన్ను (నాయికను) అభిసరించునట్లుగా దూతిని ప్రేరించుట పర్యవసానమున స్త్రీయే స్త్రీ నభిసరించుట, అను రెండుపక్షములు నవీనములు ఏర్పడుచున్నవి. ఇందు మొదటిది అప్రయోజక మని చెప్ప నక్కఱ లేదు. రెండవది ఘోర మని చెప్పవలయునా?

కావున "కాన్తం సారయే" త్తనియే ధనికహృదయము కాని "దూతీం సారయే" త్తని కాదు. అని సిద్ధాంతము.

సాహిత్యదర్పణమునకు ఐరోపియన్ పండితులు రచించిన యాంగానువాదమున నిట్లున్నది.—

**The haroine Making advances.** No 115, She who acknowledging the power of Love, sends to seek her Lover or goes herself to seek him - This one is called by the learned the one "who goes after her lover."

*Commentary.*—

The two cases are here exemplified in their order as, "Having understood his feelings thoroughly, speak to him in such a manner that he may not discern my levity in sending to lure him back after having capriciously repelled him and that he may act tenderly towards me;" thus did a certain one instruct her female messenger.

Magha Canto Viii (56)

"I have laid aside this my pair of bracelets; I have fastened my girdle tight; with much pains I have produced dumbness in my chattering anklets; - and O my dear friend, just when I had begun to be eagerly impatient to set out on love's errand, this wretch of a Moon throws aside the protecting mantle of the dark."

బ్రహ్మశ్రీ చదలువాడ సుందరరామశాస్త్రిలవారియు, బ్రహ్మశ్రీ దండిగుంట సూర్యనారాయణశాస్త్రిలవారియు నభిప్రాయములు.—

శ్రీ బ్రహ్మశ్రీ వెల్లాలసదాశివశాస్త్రిలవారిచే బ్రణీత మైన యాంధ్రదశరూపకవిమర్శగ్రంథమును సమగ్రముగాఁ బరికించినారము. ధనంజయకృత మగునదశరూపకమును ధనికరచిత మయిన తద్వ్యాఖ్యానమును బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారిచే విరచితం బగు నాంధ్రదశరూపకము నన్యోయవసరంబులం దడవి చూచితిమి.

అందు, "కామార్తా౽భిసరేత్కాన్తం సారయేద్వా౽భిసారికా" అను నభిసారికాలక్షణవాక్యమునందలి ద్వితీయభాగమునకు "ప్రియుని నభిసరింపఁజేయునది కూడ నభిసారిక" అను విమర్శోక్తియే యుక్త మయినయర్థము. దీనిం దెలిపినయనంతరము గూడ ఆంధ్రీకర్తలు "కాంతునిగూర్చి దూతిక నభిసరింపఁజేయునది" యని యర్థము వ్రాయుట కచ్చెరువుపడు చున్నారము. దూతిక నభిసరింపఁ జేయునది యనునపుడు అభిసరణకర్తృత్వము దూతికయందు సంపన్న మగుటవలనఁ బ్రథమభాగోక్తలక్షణముచొప్పున దూతిక కభిసారికాత్వము దుర్వారము. అభిసరణక్రియచేతనే కామార్తత్వము సిద్ధించుటవలనఁ గామార్తా యనువిశేషణము దూతికయం దన్వయింప కున్నను హాని లేదు. అభిపూర్వకసృధాతువునకు సంభోగార్థము గమనం బర్థము. కావున, కాంతునిగూర్చి దూతిక నభిసరింపఁజేయునది యను వచనం బుచితము కాదు. సంభోగార్థము కాంతునిగూర్చి గమనముచేయు దూతికయొక్కగమనంబునకు నాయిక హేతుభూతురా లనిచెప్పుటయు నొప్పదు. అది యీర్ష్యాద్యజనకం బైనయప్పుడు నాయికకుఁ గాంతునం దనురాగసూచకం బగుటవలన శృంగారనాయికాత్వమే వ్యాహతం బగును గదా! ఇట్లు ప్రియానయనార్థము దూతిక నభిసరింపఁజేయు

నది యనుటయు ననుచితము. అభిసరణకర్తృత్వము నాయకనిష్ఠం బైనను తద్ధేతుత్వము గలనాయిక కభిసారికాత్వము రసపోషక మగుటం జెప్పంబడియె. అది దూతీనిష్ఠ మైనపుడు నాయికకు హేతుత్వము నంగీకరించినయెడ రసభంగ మగును. ఇందువలన దూతిక నభిసరింపం జేయునది యని యభిసారము దూతీకర్తృకముగా వచియించుట యెంతమాత్ర ముచితము గాదు. ఇంక, వారు అభిసరించున్నది యనంగా పోవునది అభిసరింపంజేయునది యనంగా పంపునది యని నవరించిరి గాని, అయ్యర్థము కోశవిరుద్ధము. అభిసారః—స్త్రియాః పుంసో వా సంభోగార్థం నిర్జనసంకేతస్థానగమనే అని వాచస్పత్యము. కావున వారు అభిసారశబ్దార్థము విచారించినవారు కా రని తోంచుచున్నది. అప్పుడును, "ప్రియుని రావించుటకో మఱొకందులకో" అనుటవలన మఱొకందులకుం బంపునాయిక కభిసారికాత్వం బనుపపన్న మగుట వలన వారు సిద్ధాంత మవగాహింపనియ ట్లెంచు చున్నారము. ఇట్లు, ఇందులకు వారు వ్యాఖ్యాత యుదాహరించినశ్లోకముం బ్రమాణీకరించుటయు నర్హము గాదు. లక్ష్యవిశేషమునకుం గదా యది యుదాహరణము. ఇ య్యుదాహరణము ప్రియకర్తృకాభిసరణమునకు దూతీముఖంబున హేతుభూత యయినయభిసారికను బోధించుచున్నది. ఇంత మాత్రమున ముఖవిశేష మయినదూతిని సామాన్యవచనం బయినలక్షణమునందు ఘటించినచోం బత్త్రికాదిముఖంబునం బ్రియుని రావించు దానియందు లక్షణం బవ్యాప్త మగును. వ్యాఖ్యాతకు దూతీప్రేషణం బభిప్రేత మని వారు తలంచుట సర్వాలంకారిక విరుద్ధము. అందువలన లక్షణంబునం గాంతపద ముభయాన్వయి యని యంగీకరించియు ననాకాంక్ష మయినదూతికాపదము చేర్చుటయు దూతి నభిసరింపంజేయున దనుటయు నవిచారమూలము. ఏతద్విషయంబున విమర్శవాక్యంబు లన్నియు సర్వాలంకారికసంవాదములై సయుక్తికంబులై సూపపన్నంబులై యున్న వని యెన్ను చున్నారము.

ఇఁక నితరాక్షేపములు.—

(౧) ఎవనిదశవిధరూపంబు లనుపద్యమునందు విమర్శోక్త దోషం బుపపన్నము. "అనుకరించియు సరసులు హాయినుందురు" అనుట మూలవిరుద్ధంబును సరసులం దనుకర్తృత్వము చెప్పుటచే ననుచితార్థంబును అనుకారము శ్రమజనకమై దుఃఖరూప మగుటవలనఁ దత్కర్తలకు దుర్లభం బైనహాయిఁ జెప్పుటచే వ్యాహతార్థంబునై యున్నది.

(౨) నానుకార్యరామాదివర్తీ వృత్తత్వా త్తస్య—ఇట, "రామాదులయవస్థల ననుకరించువారియందు" ఇత్యాదిక మైనయాంధ్రంబించుకేనియు మూలము ననుసరింప కుండుటయె గాక యత్యంతానుచితముగాఁ దోఁచు చున్నది. ఇట విమర్శలేఖనము వ్యుత్పిత్సులకు బహూపకారకం బని తలంచు చున్నాము.

(౩-౪) ఈరెండుస్థలంబులందును ఆంధ్రమునఁ గృత్రిమరామాదుల కనుటయు రామాదివేషధారి యనుటయుఁ బూర్వమువలె ననుకార్యశబ్దార్థానభిజ్ఞతాకృతం బని యెంచుచున్నాము.

(౫) ఇట "సత్పురుషు లగువారికి లజ్జాసూయాదులు" అనునాంధ్రము మూలవిరోధి యగుటయె గాక యసూయాద్యభావలక్షణు లగువారికిఁ దద్భావము జనించు ననుటచే నసంభవార్థంబై యున్నది.

(౬) ఇట, ఉపాయాంపాయశంకాభ్యామ్ అనుమూలమునర్థము ఆంధ్రీకర్తల కవగతము కా దయ్యె. తదర్థము విమర్శముచే వివరింపఁ బడియె.

(౭) ఇందు షోడశధా నాయకః అనుటకు నొక్కొక్కనాయకుఁడు పదునాఱువిధము లనునాంధ్రము విరుద్ధము. ఒక్కొక్కయను శబ్దము ప్రామాదికముగా నుండనోపు నని యెన్ను చున్నాము.

(౮) "ఇట్లు త్రివిధ యగుస్వీయనాయిక" ఇత్యాదిక మగు

నాంధ్రము విమర్శమున వివృత మయినయట్లు మూలమునకును సర్వా లంకారికసమయంబునకును విరుద్ధము.

(౯) ద్వే చాద్యే క్రీడౌజ్జ్వల్యప్రహార్షితే అనుదానియాంధ్రం బునఁ గ్రమముగా ననువిశేషణంబును ఔజ్జ్వల్యపరిత్యాగంబును అన న్వితాపార్థజనకంబు లను విమర్శలేఖనము సమీచీనము.

(౧౦) ఇట "నాయకునిఁ జేరినపిదప నభిసారిక, లగుదురు" అనునాంధ్రము విమర్శోక్తరీతిని మూలోక్త మగు అభిసరన్త్యా అను వర్తమానార్థకశతృప్రత్యయాంతశబ్దమునకు విరుద్ధార్థంబై భూతాభి సరణమాత్రంబున నభిసారికాత్వము శాస్త్రవిరుద్ధముఁ గల్పించుచు నితరనాయికాఽభావము నాపాదించు చున్నది.

(౧౧) "సంకేతస్థానము చేరక పోయిరేని విప్రలబ్ధలు" అను నది సుస్పష్ట మయినమూలమునకును లక్షణమునకును విరుద్ధముగా నుండుటచే భాషాలక్షణానభ్యాసమూలం బని భావింపఁ దగి యున్నది.

(౧౨) ఛన్నకా మేత్యాదిమూలమునకుఁ దెనుఁ గత్యంతవిరు ద్ధమై యున్నది. ఇంతియకాక లోకంబునకును విరుద్ధ మగుట నెంత యు జుగుప్సనీయము. ఇట విమర్శము భూతార్థ జిజ్ఞాసువుల కుపకార కంబై వెలయు చున్నది.

(౧౩) ఇందు, విమర్శోక్తరీతిని లక్షణమునందు మూలస్థానన్న పదపరిత్యాగముచే వాసకసజ్జయం దతివ్యాప్తి దుష్పరిహారము.

(౧౪) ఇట మూలంబున శ్లక్ష్ణ మయినవికారము మాధుర్య మని యుండఁగా నిర్వికారత్వము మాధుర్య మని తెనుఁగు వ్రాయుట మూలతద్వ్యాఖ్యానములకు విరుద్ధ మగుటయె గాక వికారవిశేష మయినమాధుర్యమును వికారాత్యంతాభావముగా వచించుటచే వ్యా హత మగుచున్నది. విమర్శలేఖన మత్యంతసమీచీనము.

(౧౫) ఇట నాంధ్రీకర్తకు మూలార్థము దెలియ లేదు. కా వుననే "కొండఱమెడ...విశేషముగా" నిత్యాదిగా మూలవిరుద్ధము

గను అనుచితముగను దెనిఁగింపఁబడినది. విమర్శంబున నేతదర్థము విస్పష్టముగా వివరింపఁబడియె.

(౧౬) ఆజీవితాద్దాన మ్మనుదానియర్థము విమర్శమునఁ జక్కఁ గా వ్రాయఁబడినది. ఆంధ్రీకర్త యౌదార్యలక్షణార్థము గ్రహింప లేదు. కావుననే లక్షణాంతరము పరిత్యజించెను.

(౧౭) ఇట, "ప్రధాననాయకులకుఁ గూడ నొక్కొక్కచోఁ గథారసస్థితి కనుకూలముగా నవస్థాంతరకల్పనము విరుద్ధము గాదు" అనుట మూలమునకును సిద్ధాంతమునకును విరుద్ధము. ధీరోదాత్తునకు స్వావస్థావిరుద్ధ మయినయవస్థను గల్పించుట కథారసస్థితి కెట్లనుకూల మగును? రసభంగ మగును గదా! ఎట్లుదాత్తత్వాభిమతుఁ డైన రామునకు, ఛద్మముచే వాలిని వధించుటవలన మహాసత్త్వతం దొఱఁ గినవాఁ డగుటచే స్వావస్థాపరిత్యాగం బన్యాయ్యమో, అట్లు అంగి భూతరామాదులు ఏకప్రబంధోపాత్తు లైనవారిఁ గూర్చి యేకరూపులై యుండవలసినవా రగుటవలన వారికి ఆరంభోపాత్త మయినయవస్థను దప్పించి యవస్థాంతరోపాదాన మన్యాయ్యము. అని అంగినస్తు ఇత్యాది వాక్యమున కర్థము. ఆంధ్రీకర్తలేఖనంబునకును మూలతద్వ్యాఖ్యాన ములకును సంబంధము లేదు. ఇందు విశేషము విమర్శమున సమీచీన ముగా నిరూపింపఁబడినది.

(౧౮) ఇట, వక్ష్యమాణము లగు దక్షిణాద్యవస్థలు నిత్యసా పేక్షము లగుటచే అంగనాయకులకును అంగినాయకులకును వీనిలో ఉపాత్తావస్థను విడిచి యవస్థాంతరముఁ జెప్పుట దోషము గాదను వ్యాఖ్యానాశయము విడిచి స్వేచ్ఛమెయి నయుక్తముగా నాంధ్రము వ్రాయఁబడియె. విమర్శమునం జక్కఁగా వివరింపఁబడినది.

(౧౯) ఇందును విమర్శలేఖనము హృదయంగమము.

(౨౦) నృతే గ్గాత్రవిక్షేపార్థత్వేన—ఇత్యాదిమూలవ్యాఖ్యాన మునకు "గాత్రవిక్షేపమే ప్రయోజనముగాఁ గలనృత్యము చేయు

వాఁడు" ఇత్యాదిగాఁ దెనుఁగుఁ వ్రాసినయాంధ్రటీకకర్తకు భాషానభిజ్ఞత తెల్లము. విమర్శోక్తి యుక్తము.

(౨౧) ఇట, ఆంధ్రటీకకర్త కన్వయబోధము కలుగలేదు. సిద్ధాంతానవగతివలన నిట్టిప్రమాదము పుట్టెను. పదార్థము లైనవిభావాదుల సంసర్గమువలన నిష్పన్న మైనవాక్యార్థమే రస మగుటవలన రసాశ్రయ మ్మనుటచే నాటకాదికము వాక్యార్థాభినయాత్మకం బని తెలుపఁబడిన దని రసస్య చేత్యాదివాక్యమున కర్థము. అట్లుండఁగా, రసలక్షణము విచారింపమివలన "రసమో విభావాదిసంసర్గము గలదియై" ఇత్యాదిగా నపార్థలేఖనము సంభవించెను. విమర్శం బీవిషయమును విశదముగా నిరూపించుట విద్యార్థిజనుల కుపకారకము.

(౨౨) ఇందును, విమర్శోక్తరీతి నాంధ్రము మూలవ్యాఖ్యానవిరుద్ధము. సాత్త్వికబాహుల్యము సాధించుటకై నటధాతువు కించిచ్చలనార్థకం బగుట హేతువుగాఁ జెప్పఁబడియుండఁగా, మూలమున నసాధయిషిత మైనసాత్త్వికబాహుల్యమును విడిచి హేతువుగాఁ జెప్పఁబడినదియే యసాధయిషితము "కించిచ్చలనము గలనాట్యము" అనుట సాధింపఁబడెను. ఇది మూలానధ్యయనకృతము.

(౨౩) ఇటఁగూడ, విమర్శవచనం బుపపన్నము. ఏకార్థప్రవృత్తము లైననాట్యరూపరూపకశబ్దములకుఁ బ్రవృత్తినిమిత్తభేదము ప్రదర్శిత మయ్యె ననుసర్థం బాంధ్రటీకకర్తకనవగతము.

(౨౪) ఇట, రసలక్షణాపరిజ్ఞానమువలనను మూలార్థంబును గాని వ్యాఖ్యానాశయమును గాని యవగాహింపమివలనను ఆంధ్రటీకకర్తకు గొప్పప్రమాదము గలిగెను. అనేకవిధంబు లనుట యధికము, తథావి ధేత్యాదికము పరిత్యక్తము. ప్రకటింపఁబడినదై యనుటయు చూచువారియొక్కయు నిత్యాదికంబును ఈరసంబుననే యనుటయు నత్యంతవిరుద్ధములు. విమర్శమునందలి యేతద్వివరణం బత్యంతతోషకారకంబు.

(౨౫) ఈస్థలంబునను విమర్శోక్తి యుపపన్నము.

(౨౬) ఇందును, ఆంధ్రగ్రంథం బసంగతము. విమర్శకృత నిరూపణం బుపపన్నము.

(౨౭) ఇందును మూలతద్వ్యాఖ్యలఁ బరిశీలింపక యాంధ్రమున నపసిద్ధాంతము వ్రాయఁబడియె. ఆలస్యాదికము ఏకాశ్రయత్వంబున నుపనిబద్ధ మైనచో విరుద్ధం బగు నని మూలోత్తరార్థాభిప్రాయమై యుండఁగా విరుద్ధములు గా వని వ్రాయుట విరుద్ధము గదా! ప్రకారాంతరంబున నవిరోధము మున్ను ప్రతిపాదింపఁబడిన దని వ్యాఖ్యాత చెప్పినభావమును బ్రకారాంతరము వివరింపక విరుద్ధములు కావని మున్నె చెప్పఁబడిన దని మాత్రము వ్రాయుట మూలవిరోధమును బరిహరింపఁజాలనిదై యసంగత మగుచున్నది. విమర్శమున నేతద్విషయము చక్కఁగా నుపపాదింపఁబడినది.

(౨౮) ఇట మూలమున కాంధ్రము తేజస్సునకుఁ దిమిరము వలె విరుద్ధమై యున్న దనుట సత్యము. ఏతద్వ్యాఖ్యానార్థ మాంధ్రకారు లవగాహించినవారు కారు. విప్రలంభము అయోగమునందును విప్రయోగంబునందును అంతర్భూతము. ఎచ్చట విప్రలంభము గలదో అచ్చట అయోగమో విప్రయోగమో సిద్ధముగా నుండుటయె గాక అవి విప్రలంభేతరస్థలములందును ఉన్నవి. కావున వ్యాపకము లయిన యయోగవిప్రయోగములఁ జెప్పుటచేతనే తద్వ్యాప్య మయిన విప్రలంభముగూడ చెప్పిన ట్లగుటవలన విప్రలంభమును వేఱుగాఁ జెప్ప లేదు. కొందఱు అయోగవిప్రయోగములను మాని విప్రలంభమును దత్సామాన్యవాచకముగా వచించుట యుచితము గాదు. ఎందువలన ననఁగా. అయోగవిప్రయోగవిశేషవాచక మయినవిప్రలంభమును తత్సామాన్యవాచకముగాఁ బ్రయోగించినచో విప్రలంభము వంచనము సంభవింపని యయోగవిప్రయోగములందు ఉపచరితవృత్తమగును—అనఁగా, వానిని ముఖ్యవృత్తిచే బోధింపఁజాలదు. అందువలన

గ్రంథకర్త విప్రలంభశబ్దమును బ్రయోగింపలే దని వ్యాఖ్యానాభి ప్రాయము. వంచనార్థక మయినవిప్రలంభశబ్దమునకు ముఖ్యప్రయోగము ప్రదర్శింపఁబడియె తథా హీత్యాదిగా. ఇట్లుండఁగా, సంస్కృతమున నయోగవిప్రయోగవిశేషముగాఁ జెప్పఁబడిన విప్రలంభమును దత్సామాన్యముగాఁ జెప్పుటయు నుక్తార్థసాధనార్థ ముపన్యస్త మయిన తథా హీత్యాదికము పరిత్యజించుటయు అయో గేత్యాదిగా విరుద్ధార్థము వ్రాయుటయు నత్యంతవిరుద్ధము గా దని యెట్లు సాధింపవచ్చును? ఇట్టిగ్రంథమును బ్రశంసించి స్తుతిపాత్రు లైన పండితకవుల నస్మచ్ఛ్రుతి పాత్రీకరింపవలయు నని ప్రార్థించెదము. ఏతద్విషయంబున విమర్శ గ్రంథావిష్కృతవివరణము విద్యార్థిజనవ్యుత్పాదకంబై వెలయుచున్నది.

(౨౯) ఇట మూలతద్వ్యాఖ్యానంబులఁ గార్యజప్రవాసము బుద్ధిపూర్వకం బగుటవలన భావ్యాదిభేదంబులఁ ద్రివిధ మనియు సంభ్రమజప్రవాసము సహసోత్పన్నము—అబుద్ధిపూర్వక మగుటవలన నేకరూపం బనియు స్పష్టముగాఁ బ్రతిపాదింపఁబడి యుండఁగా, ఆంధ్రమునందుఁ గార్యప్రవాసము సర్వసామాన్య మనుటయు బుద్ధిపూర్వకముగాఁ గాని సంభవించినయెడఁబాటు సంభ్రమప్రవాస మనుటయు భాషానభ్యాసమూలం బని చెప్పక తప్పదు.

(౩౦-౩౧) ఈరెండుస్థలంబులందును ఆంధ్రీకరణంబునఁ గ్రమం బాదరింపఁబడినది గాదు. కావున విమర్శోక్తదోషము సూపపాదము.

ఇయ్యాంధ్రదశరూపకము పరిశీలింపఁగా నింకం బెక్కులు దోషములు చూపట్టు చున్నవి. ఆంధ్రీకరణంబును సమగ్రముగాఁ జేయఁబడినది గాదు. విమర్శస్పృష్టభాగంబు లన్నియు నపక్షపాతంబునఁ బరికించియుఁ దదుక్తదోషంబులు యత్నించినను దుర్నివారంబు లగుటకుఁ జింతించు చున్నాము. ఇట్టిగ్రంథము విమర్శక్షమము గా దని మాయాశయము. అయినను, విద్వజ్జనవిరచితంబు లగు నేతాదృశ

విమర్శంబులు విద్యార్థులకు వ్యుత్పత్తిసాధనంబు లగుటవలన విద్వత్ప్రభుపరిపోషితంబులై యవిచ్ఛిన్నముగా నాంధ్రభాషాయోష కలంకారములై వెలయవలయును.

ఇట్లు,

౧-౧౨-౧౬. }
చెన్నపురి. }

చదలువాడ సుందరరామశాస్త్రిలు.
దండిగుంట సూర్యనారాయణశాస్త్రిలు.

మద్రాసు పచ్చయప్పకాలేజీలో నాంధ్రవిద్యోపాధ్యాయు లగు శ్రీమత్పర్ణశాల నరసింహాచార్యులవారి యభిప్రాయము.—

"శ్రీమజ్జటప్రోలుసంస్థానాధీశ్వరు లగు శ్రీ శ్రీరాజా వేంకటలక్ష్మారావు బహాదూర్ నిజాం నవాజువంతుగారిసన్నిధికి.

చెన్నపురి పచ్చయప్పపాఠశాలాపండితుఁడు పర్ణశాలనరసింహాచార్యుఁడు సవినయముగ వ్రాసికొనిన మనవి.

ఏలినవారియాశ్రితులు శ్రీసదాశివశాస్త్రిలవారి యాంధ్రదశరూపక మనుపేరు గలగ్రంథమును సమంజసముగ విమర్శించినాను.

అందు శ్రీశాస్త్రిలవారు చూపినదోషము లన్నియు భరతాది మహర్షిప్రణీతసంప్రదాయసన్మార్గములవిషకంటకము లగు చున్నయవి. ఆక్షేపణీయగ్రంథకర్తలే గాక విద్వాంసు లగు మఱియెవ్వరైన మానుషసాధారణ మగుప్రమాదములవలనఁ గల్గినదోషములను సహితము విశేషజ్ఞులవిమర్శములఁ బరిహరించికొని సనాతన మగు నస్మదీయవాఙ్మయమునకుఁ గళంకము రాకుండఁ జేయ సర్వేశ్వరునిఁ బ్రార్థించుచున్నాఁడను.

24-1-1917. }
మద్రాస్. }

ప. నరసింహాచార్యులు.

తిరుపతి శ్రీమాన్ శ్రీరంగాచార్యులవారి యభిప్రాయము.—

"తిరుపతినగరాత్ కొల్లాపురమహారాజాస్థానపండిత వెల్లాల సదాశివశాస్త్రి సంప్రేషిత పత్రికాకృతచోదనా వశాదియం పత్రికా లిఖితుమారబ్ధా మల్లాది సూర్యనారాయణశాస్త్రి కృ తాంధ్రదశ రూపకగ్రంథవిషయో యో వివాదః ప్రవృత్త స్తయోః తదీయతా దృశ వివాదవిషయ విప్రతిపన్నార్థ నిర్ధారణాయ. "ఇయం తావ దత్ర విప్రతిపత్తి రవగమ్యతే తయోః ద్వితీయాభిసారికావిషయే, దూతికాయా స్స్వప్రియసంయోజనమాత్రే ణాభిసారికా త్వం వా, దూతి కాద్వారా తమావాహ్య స్వయం తదభిసరణేన తద్వా, ఇతి. తత్ర ద్వితీయః పక్ష ఏవ ప్రామాణికః, ప్రథమపక్షస్తు ప్రామాదిక ఏవ, తస్య గ్రంథవాక్యార్థ యథావ దనవధారణ మూలత్వాత్. తథాహి. కామార్తాఽభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా ఇతి తల్లక్షణే కామార్తాయా స్స్వయం కాంతాభిసరణస్య, అన్యద్వారా కాంతస్య స్వాభిసరణప్రవర్తనస్య చైవ ప్రతీతేః, ద్వితీయాంత కాంతశబ్ద స్యైక స్యై వోభయక్రియాన్వయ ప్రతీతేః, అన్యథా ద్వితీయాంతదూతీ శబ్దా ధ్యాహారప్రసంగాత్, దూతీసంయోజనేన స్వీయ కామార్తత్వ పరిహా రా సిద్ధేః, స్వీయ కామార్తి నివృత్త్యర్థ జారభర్తృగంతృత్వ స్యైవా భిసారికా శబ్దప్రవృత్తినిమిత్తత్వేన తదసిద్ధిప్రసంగాచ్చ. కించ కుతోఽపి సంకేతస్థాన మప్రాప్తే నాయకే విప్రలబ్ధే ఇతి వ్యాఖ్యానవాక్య ము దాహృత్య విప్రలబ్ధే ఇతి శబ్దస్య స్త్రీపురుషయో ర్విప్రలబ్ధత్వ పరత యా ఽనుసంధానం కృతం దృశ్యతే. తత్తు పరస్త్రియా ఇతి విశేష్యప దార్థాఽపరిజ్ఞానమూలక మవగమ్యతే, స్వనికటాప్రాప్త నాయకవంచి తత్వేన స్త్రియో రేవ విప్రలబ్ధాత్వ ప్రతిపాదన స్యైవ తదభిప్రే తత్వాత్.

ఏవ మనేకేషు స్థలేషు మల్లాది సూర్యనారాయణశాస్త్రివా క్యేషు శాస్త్రార్థా పరిజ్ఞానమూలకత్వ మే వావగమ్యతే. స్థాలీపులాక

న్యాయేన గ్రంథవిస్తరభియా కించి దేవ ప్రదర్శితం, సర్వ మసంబద్ధ మేవ దృశ్యతే సమ్యగ్విచారే.

పింగళశ్రావణ } ఇతీయం పత్రికా
శు ౫. } శ్రీశైలానంతపూరుష శ్రీరంగాచార్యేణ లిఖితా.

తిరుపతి శ్రీమాన్ కపిస్థలము దేశికాచార్యులవారియభిప్రాయము.—

“దశరూపకే, కామార్తాభిసరేత్కాంతం సారయేద్వాభిసారికేత్యభిసారికాలక్షణ మభిహితమ్. అస్య లక్షణవాక్యస్య యా కామార్తాసతీ కాంత మభిసరేత్ సా ఏకాభిసారికా యాచ తథాభూతాసతీ కాంత మభిసారయేత్ సా అపరాభిసారికా ఇత్యర్థ ఇతి సదాశివశాస్త్రిణాం పక్షః. ప్రథమపాదార్థ స్స ఏవ ద్వితీయపాదస్య తు యా కామార్తా సతీ దూతీ మభిసారయేత్, కాంతం ప్రతిప్రేషయేత్, సా ద్వితీయాభిసారికా. ఇత్యర్థ ఇతి సూర్యనారాయణశాస్త్రిణాం పక్షః. అనయో పక్షయోః కః ప్రామాణిక ఇతి ప్రశ్నః. అస్యోత్తరమ్. సదాశివశాస్త్రిణాం పక్ష ఏవ ప్రామాణికః, నతు సూర్యనారాయణశాస్త్రిణామ్. తత్పక్షే ద్వితీయపాదే దూతీ మిత్య స్యాధ్యాహర్తవ్యత్వాత్తస్య చానుషంగాపేక్షయా జఘన్యతాయా స్తాంత్రికై స్సిద్ధాంతితత్వాత్. యద్యపి సారయే'దిత్యస్య ద్వికర్మకతయా ప్రథమపక్షేపి స్వాత్మాన మి త్యధ్యాహృత్య కాంతం స్వాత్మాన మభిసారయేదిత్యర్థస్య వక్తవ్యతయాఽధ్యాహార స్తుల్యః, తథాపి, కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికేతి విద్యానాథోక్తాభిసారికాలక్షణవ్యాఖ్యానావసరే రత్నాపణే, కాంతస్య కర్మణః కర్తుర్వాభిసరణే ఉద్యుక్తేతి మూలస్థ కాంతాభిసరణోద్యుక్తపదస్య కాంతకర్మకాభిసరణోద్యుక్తార్థకత్వం కాంతకర్తృకాభిసరణోద్యుక్తార్థకత్వంచ వ్యాఖ్యాయ తదుపష్టంభకతయా అత ఏవోక్తం స్మరార్తాభిసరేత్కాంతం సారయేద్వాభిసారికేతీతి అస్యైవలక్షణ శ్లోక స్యోదాహృత

త్యేవ సారయే ద్వాభిసారికే త్యస్య కాంతకర్తృకాభిసరణ ఘటిత లక్షణపరత్వస్య స్ఫుటీకృతతయా స్వాత్మకర్మక కాంతకర్తృ కాభిసరణ ఘటితలక్షణ పరే ఽస్మిన్వాక్యే స్వాత్మాన మి త్యధ్యాహార ఏవ న్యాయ్యః, నతు దూతీ మితి. ఏవం చ సతి మదనానలసంతప్తా యాభిసారయతి ప్రియమ్, స్వయం వాభిసరే ద్యాతు సా భవే దభిసారికా, అభిసారయతే కాంతం యామన్మథవశానుగా, స్వయం వాభిసర త్యేషా ధీరై రుక్తాభిసారికా, ఇత్యాది బహుతరాభిసారికాలక్షణవాక్యై కార్థ్య మపి సిధ్యతి. అత స్సదాశివశాస్త్రిణాం పక్ష ఏవ ప్రామాణిక ఇతి సంక్షేపః.

| | |
|---|---|
| పింగళసంవత్సర<br>శ్రావణశుద్ధపంచమ్యాం<br>లిఖిత మిదమ్. | ఇత్యుత్తరయితా<br>కపిస్థలోపపదదేశికాచార్యః,<br>తిరుపతిపురవాసీ. |

తిరుపతి శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారి యభిప్రాయము.—

"బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రిలవా రంపిన" "ఆంధ్రదశరూపకవిమర్శ" మనుపొత్తంబునఁ బ్రథమభాగం బగు నభిసారికా విషయవివాదంబును జదివినాఁడను. దానిం గూర్చి నాయభిప్రాయము దెలుపు మని శ్రీశాస్త్రిలవారు కోరినకతంబున నిట వ్రాయుచున్నాను.—

"కామా ర్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" అను లక్షణమున కర్థము నిర్ణయించుటలో శ్రీసదాశివశాస్త్రిలవారును శ్రీ వల్లాదిసూర్యనారాయణశాస్త్రిలవారును బూర్వార్ధమున కొక్కటిగా వ్రాసి యుత్తరార్థమునకు శ్రీసదాశివశాస్త్రిలవారు కాంతుని దన్నుఁ గూర్చి యభిసరింపఁజేయునది యనియు శ్రీసూర్యనారాయణశాస్త్రిల వారు కాంతునిగూర్చి దూతి నభిసరింపఁజేయునది యనియు నర్థములు

వ్రాసిరి. ఈ యర్థద్వయమువలన ననర్థములు వొడమె. అయ్యవి నిరర్థకంబు లని యేఁ దలంచెద. వీనిలో నేయర్థము సమర్థనీయం బని విచారించినచో శ్రీసదాశివశాస్త్రులవా రుపపాదించినదియే సమంజస మని తోఁచుచున్నది. "కాంతమ్" అనుపదము "అభిసరతి" "సారయేత్" అను నీరెండు క్రియలకును గర్మముగా నున్న దనుట స్పష్టము. "కాంతం సారయేత్" అనఁగాఁ గాంతుని దన్నుఁ గూర్చి యభిసరింపఁ జేయునది యనుట ఋజ్వర్థమై యొప్పారెడి. "దూతీం కాంతం ప్రతి సారయేత్" అని యర్థము సెప్పుటలో దూతీ మనుపదము నధ్యాహారము చేసికొనవలసి యుండెడు. ఇది మూలశ్లోకమువలన నేర్పడదు. వ్యాఖ్యాత యుదాహరించినశ్లోకమువలన నూహ్యం బని శ్రీ సూర్యనారాయణశాస్త్రులవారు నుడివెదరు.

"నచ మే ఉపగచ్ఛతి యథా లఘుతాం కరుణాం యథాచ కురుతే సమయి। నిపుణం తథైన ముపగమ్యవదే రభిదూతి కాచి దితి సందిదిశే" అను నాశ్లోకమునందు నాయకున్నొద్దకు నాయిక దూతికఁ బంపుటయే యభిమతము కాని కాంతానయనము దీనిలో ధ్వనింపదు. శ్రీసూర్యనారాయణశాస్త్రులవారే "దూతికచేఁ దనస్థితిని నాయిక వర్తమానించినపిదప నాయకుఁడు రావచ్చును లేదా నాయికయే పోవచ్చును. ఆవిషయ మిందుఁ జర్చనీయము కాదు" అని వక్కాణించి యున్నవారు. కావున నాయకానయన మొక్కటియే స్ఫురింపదు. నాయికాగమనము నుపపాదించునెడ నయ్యది పూర్వార్ధంబున నుక్తం బగులఘుతాముచేఁ జరితార్థం బయ్యె. ఇట్లగుటచే నాయకానురంజనముకొఱకుఁ గేవలదూతీప్రేషణమాత్రమే యాశ్లోకమునకుఁ దాత్పర్య మని తేలుచున్నది. కేవలదూతీప్రేషణముచేఁ గాంతానురంజన మొనరించినంతమాత్రమున నాయికకుఁ గామార్తత్వపరిహారప్రాప్తి యొదవదు. కాంతునియొద్దకుఁ దా నరుగుటయో కాకున్నఁ దనయొద్దకుఁ గాంతుని రప్పించుటయో లేకున్నఁ గాంత కీప్సితార్థసిద్ధి లేమి

తెల్లంబు కావున శ్రీసూర్యనారాయణశాస్త్రులవా రుపపాదించునర్థము గ్రహింతుమేని యప్పుడు కాంత కభిమతార్థసిద్ధి యొదవ దని యొప్పు కొనక తప్పదు. "దూతీప్రేషణమువలన నాయకుఁడు కాంతయొద్దకు రానచ్చును" అను నాయికోద్దేశ్యమునే శ్లోకతాత్పర్యముగా గ్రహింతు మేని "కాంతం సారయేత్" అనునర్థమే యగుచున్నది. అది యిష్టా పత్తియే. కావున నేచందంబున విచారించినను శ్రీ సదాశివశాస్త్రుల వారు వచించినయర్థమే సరళముగాను సయుక్తికముగాను నున్న దని నాకుఁ దోఁచుచున్నది.

26-9-1917. తిరుపతి.

ఇట్లు,
నాగపూడి కుప్పుస్వామయ్య.

వేంకటగిరి సంస్థానాస్థానవిద్వాంసు లగు శ్రీచేట్లూరి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రులవారి యభిప్రాయము.—

ఇదివరలో మీరు పంపించియుండే విమర్శగ్రంథము చేరినది మీరు వ్రాసినఆక్షేపము లన్నియు సరియైనవె. వేరే కాదు. వెంబడే జాబు వ్రాయక యుండుటకు కారణ మేమి యనగా అంతకుముందే మీరు జాబులమూలముగా కొన్ని ఆక్షేపణలు శ్రీ శ్రీ శ్రీ పెద్దమహారా జాగారికాలములో వ్రాసి యుంటిరి. అప్పుడు శ్రీ శ్రీ శ్రీ మహారాజా గారు నన్ను పిలిపించి మీరు వ్రాసినఆక్షేపణ లన్నిటిని జదివించి చర్చ చేసి విన్నారు, అందుమీద మీకు జాబువ్రాయించుటలో శ్రీవారియభి ప్రాయముకూడా మీకు విశదమై యుండును అని తలచి వ్రాయలేదు. ఇది గాక మీరు పట్టాభిషేకసమయమందు అవశ్యం వస్తురు అప్పట్లో సమక్షమందు చక్కగా మాట్లాడవచ్చును. వ్రాయడమునకు అవసరం లేదను తాత్పర్యముతోనున్ను అప్పుడే బదులు వ్రాయలేదు. మీరు విమర్శలో వ్రాసినఆక్షేపములు 30 సరియైనవే. అయినను ఆంధ్రము చేయువాటిలో అర్థము తెలిసిన్ని పొరపాటుగా వ్రాసినతప్పులు కొన్ని,

అర్థము సరిగా తెలియక పొరపాటుగా వ్రాసినతప్పులు కొన్ని. విపరీ తార్థజ్ఞానముచే వ్రాసినది కొన్నితప్పు లని తోచుచున్నది. యీసంగతి మీమనస్సునకు తెలిసి యుండవచ్చును. మొత్తమునకు తప్పులు అనియే చెప్పవలెను.

చే - వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీగద్వాలసంస్థానాస్థాన పండితాభిప్రాయము.—

శ్రీమద్వ్యజనేత్యాది......సదాశివశాస్త్రిణాం సన్నిధౌ, విజ్ఞప్తి మాలికా.— భవత్ప్రేషి తాంధ్రదశరూపకవిమర్శ స్థాభిసారికాలక్ష ణాదివిషయే మల్లాది సూర్యనారాయణశాస్త్రిణః పక్ష మవలంబ్య బహుధా విచారితేపి యాస్మాకీనరాద్ధాంత ఏవ సాధీయా నిత్యాస్మాకీనో ద్రఢిష్ఠోభిప్రాయః.

౧. పుల్లగుమ్మి వేంకటాచార్యః.
౨. హారతి దీక్షాచార్యః.
3. కొండాపురం కృష్ణమాచార్యః.

శ్రీగద్వాలసంస్థానవిద్వాంసు లగు రావూరి నారాయణశాస్త్రులవారి యభిప్రాయము.—

"శ్రీసచ్చిదానంద పూర్ణాత్మ పరమానుగ్రహ పరిప్రాప్త నిర వద్య విద్యానురాగ విశదీకృ తాశేష శేషశీర్ష కంపానహాభాషా సంప ద్విశేషభూషిత దోషజ్ఞ జర్ఝ భపాలన చాతుర్యవిరాజితానాం శ్రీమ జ్జట ప్రోలుసంస్థానవరాధీశ్వరాణాం శ్రీమతాం శ్రీ శ్రీరాజా వేంకటలక్ష్మీ రావు బహాదూరు నిజాం నవాజువంతు బిరుదాంచితానాం విద్వత్ప్రభు వరాణాం స్తాదయం ప్రమోదాయ వినయపూర్వకో లేఖః శ్రీమ ద్గద్వాలరాజధానీవసతే ర్నారాయణశాస్త్రిణః కాంక్షితః పౌనః పున్యేన నారాయణశాస్త్రిణః. విశేషస్తు. శ్రీమ త్సంస్థానవిద్వదగ్రేస రాణాం తత్రభవతాం శ్రీసదాశివశాస్త్రిణా మాంధ్రదశరూపక

విమర్శవ్యాజేన మల్లాది సూర్యనారాయణశాస్త్రిణాం చ సరజాతేః ప్రసంగం సమ్యగాలోక్య ఫలితాంశరూపేణ తత్ర భవచ్ఛ్రీమత్సదాశివశాస్త్రిణాం పక్షమవలంబ్య సంప్రత్యహం విశేషవిలేఖనా క్షమస్సన్న సంప్రదాయవిదో మూర్ధా ఇహో పేక్షణీయా అభియుక్తైః ఇత్యర్థ మావేదయామీతిశమ్.

పింగళమార్గశీర్షకృష్ణ
ద్వితీయాభానువాసరః. } రావూరు నారాయణశాస్త్రి

వనపర్తిసంస్థానాస్థానవిద్వద్వరాభిప్రాయము.—

"బ్రహ్మశ్రీ సదాశివశాస్త్రిణాం సన్నిధిం ప్రతి సహస్రశః నమస్కృత్య విజ్ఞాపయతి వనపర్తిసంస్థానవిద్వాన్ ఆచార్యరంగాచార్యః భవత్ప్రేషిత ఆంధ్రదశరూపకవిమర్శగ్రంథః సమ్యగవాలోకి. కార్యవశేన కృతవిలంబః క్షంతవ్యః. భవద్భిః ప్రతిపాదితాః అభిసారికాదివిషయాః శాస్త్రసమ్మతత్వేన అస్మాక మపి సమ్మతా ఇతి జ్ఞేయమ్.

ఆచార్య రంగాచార్యః.
వనపర్తిసంస్థానవిద్వాన్.

అత్ర సమ్మతి మన్వానః
ఆచార్య రాఘవాచార్యః.
ఆస్థానవిద్వాన్

వనపర్తిసంస్థానవిద్వద్వర శ్రీనంబాకం రాఘవాచార్యులవారియభిప్రాయము.—

విజ్ఞాపనము.— సంస్కృతదశరూపకగ్రంథమును శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రీకరించి యున్నారు.

అట్టిగ్రంథమును ప్రాయేణ అన్ని భాగములను బ్రహ్మశ్రీ వేల్లాల సదాశివశాస్త్రిగారు విమర్శించి ఆక్షేపించి యున్నయంశములను వా

గ్రంథముద్వారా చూచి యున్నాము. ఆక్షేపములు మిక్కిలి సమంజస ములై మాకు తోచియున్నవి. బాలురకుగూడ నయుక్తము లని తోచు నట్లు అంత గొప్పపేరు గల సూర్యనారాయణశాస్త్రిగారు ఎట్లు అంగీ కరించిరో యని చాల వింతయై తోచుచున్నది.

ఇతి విజ్ఞాపయతి నంబాకం రాఘవాచార్యః.

వనపర్తిసంస్థానవిద్వాన్.

నేది అప్పలాచార్యర్.

గో. రాఘవాచార్యస్యాపి సమ్మతమిదమ్.

గద్వాల పునహా నరసింహాచార్యః.

వనపర్తిసంస్థానాంతర్వర్తి శ్రీరంగాపురవాసినః సిద్ధాంతి రాఘవాచార్యస్య సమ్మతిః.

నదీఅగ్రహారం తోపు వేంకటాచార్యులసమ్మతి.

శ్రీమత్పల్లా నృసింహశాస్త్రిగారియభిప్రాయము.—

విజ్ఞాప్యతే.—శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిభిః సంస్కృత దశరూపకగ్రంథ ఆంధ్రీకృతః, తద్గ్రంథస్తు సంస్కృతదశరూపకగ్రంథా నుగుణతయా నాస్తీతి శ్రీ వెల్లాల సదాశివశాస్త్రిభిః తత్ర తత్ర ప్రత్యా ఖ్యాతః, మయాతు ఆంధ్రదశరూపకగ్రంథస్య తద్విమర్శస్యచ పర్యా లోచనా సమ్యక్కృతా, శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రి కృ తాంధ్రదశరూపకగ్రంథః అవిచారితరమణీయః, శ్రీసదాశివశాస్త్రికృ త విమర్శస్తు విద్వద్రమణీయ ఇతి మమ ప్రతిభాతి.

పల్లా నృసింహశాస్త్రిభిః ప్రతిపాదితోయ మర్థః.

విజయనగరసంస్థానాస్థానవిద్వద్వర మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రులుగారి యభిప్రాయము.—

తమచేఁ బ్రకటింపఁబడిన యాంధ్రదశరూపకవిమర్శమును స్థాలీపులాకన్యాయముగఁ జదివితిని. దానియభిప్రాయము విశేషముగా

నిచ్చుటకు నాకు ప్రస్తుత ముండెడు కార్యతంత్రచేత నవకాశము లేనం దుకు చింతిల్లుచున్నాను. విమర్శము సప్రమాణముగ నున్న దని నా యభిప్రాయము. ఇం దొకయంశమును కొంచెము నిరూపించెదను. "అభిసారికా" అనుపదమునకు వివరణము సంస్కృతదశరూపకమున జూపఁబడినది. ఆవివరణమును బట్టి చూడ మూలధాతుప్రకృతికణ్వ్యంతముగాను ణిజంతప్రకృతికణ్వ్యంతముగాను అభిసారికాపదము గ్రహించవలసిన దని గ్రంథకర్త సూచించినట్లు కన్పట్టుచున్నది. ఇచట ణిచ్ప్రకృత్యర్థమునకు కర్త కాంతుఁడా దూతియా యని నిరూపణీయాంశము.

కాంతుఁడైనచో ణిజంతార్థమున కాంతుఁడు కర్త యనుటకు సందేహము లేదు. దూతి యైనచో దూతి కర్త యగుట కవకాశము కలదు. అభిపూర్వకసృధాతువుకు సంగమాభిలాషపూర్వకగమన మర్థ మని వాచస్పత్యాదికోశములవలన తేటపడ గలదు. అట్టిగమనములో దూతికి కర్తృత్వమును ఆంధ్రదశరూపకకర్త లంగీకరించెదరా? అంగీకరించకుండిన ణిజంతార్థములో దూతికి కర్తృత్వ మెటులు సిద్ధించును. ఇఁక "సారయేత్" అనుచోట "అభి" అనుపదము లే దని వారు తలంచుచున్నారు. "అభి" అనుదాని కనుసంధానము చేయవలయు నని వారు గ్రహించలేదు. అనుసంధానము లేనిచో నిది సారికాపదవివరణ మగును గాని అభిసారికాపదవివరణము కానేర దని యెల్లరకును విశదమె. ఇతరగ్రంథములను చూచినవా రిటులు సందేహించుట కవకాశము లేదు. లక్ష్యము చూచి వా రిటులు సందేహించినట్లు కాన్పించుచున్నది. ఆలక్ష్య ముండెడిప్రకరణమును కొంచెము పరికించిన కాంతుఁడభిసరించినటులె స్పష్టముగా నున్నది. మాఘకావ్యము చూడ వచ్చును. దూతి యభిసరించిన ట్లగపడదు. ప్రస్తుతకాలమున నేదో యొకటి వ్రాయుటయును, అం దేదేని దోష మున్న దాని నితరులు తెలియపరుప సహింపక నేదో యొకవాదమును పెంచి యుక్తి యు

న్ననులేకున్నను పత్రికలు నింపుటయు అలవాటు పడి యున్నది. ఆపత్రికలలో యుక్తాయుక్తములను గ్రహించెడివా రరుదు. కావున నిట్టియంశములో దోషములను మాత్ర మగపరచి కలహాము వచ్చినచో అట్టివాదము నుంచి విరమించుటయే ప్రామాణికులకు కర్తవ్యమై యున్నది. అని.

తాతా సుబ్బారాయశాస్త్రి.

శ్రీవిజయనగరసంస్థానాస్థానవిద్వద్వర శ్రీపేరి కాశీనాథశాస్త్రిలవారి యభిప్రాయము.—

పింగళసంవత్సరాషాఢబహుళషష్ఠీ సోమవారః.

భోభోః ఆర్యమిశ్రాః, ఏవ మత్ర భవంతో విదాం కుర్వంతు. అథ తత్ర భవద్భిః భవద్భిః ప్రేషితా మాంధ్రదశరూపకవిమర్శనపత్రికాం సమ్య గవలోక్య మేదురప్రమోదభరితాంతః కరణాస్స్మః. ధనికకృతదశరూపకగ్రంథ స్థాభిసారికాలక్షణస్య “కామార్తాభిసరే త్కాంత” మితి శ్లోకగతోత్తరార్ధస్య “సారయే ద్వాభిసారికే” త్యస్య స్వయ మభిసరతి కాంతం దూతీం వా అభిసారయ తీత్యర్థద్వయం కేచి దాహుః, పరేతు “కాంతం స్వయ మభిసరతి యా సాభిసారికా, కాంతం స్వసన్నిధిం ప్రత్యభిసారయతి యాసా ప్యభిసారికేతి. ప్రియం ప్రతి స్వస్యాః అభిసరణం. అథవా స్వసన్నిధిం ప్రతి ప్రియ స్యాభిసారణ మిత్యేవార్థః ప్రతీయతే, నతు దూ త్యభిసారణం - ఏవం ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాయాం చ, నాయికాభిసరణ ముక్త్వా ఏవ మేవ కాంత కర్తృకాభిసరణే ప్యుదాహార్య మిత్యుక్తమ్, తత్రాపి దూతీ ప్రసంగ ఏవ నాస్తి, “నచ మేవ గచ్ఛతి యథా లఘుతా మి” త్యస్య శ్లోక స్యార్థ ఏవ్మప్రకరణాదిసంబంధవశేన నజ్ఞాత ఇతి ప్రతీయతే, “అభిసారయతే కాంతం యామన్మథ వశంవదా స్వయం వాభిసరే దేషా కథ్యతే సాభిసారి” కేతి లక్ష ణైకవాక్యతయా “సారయే ద్వాభిసారి” కేతి లక్షణ

గతోత్తరార్ధస్యాపి స్వకర్తృకకాంత కర్మకాభిసారణ మి త్యేవార్థో యుక్తః, నతు దూ త్యభిసారణ మితి, తత్ర కాంతపదస్య శ్రుతత్వాత్ శ్రుతహానాశ్రుతకల్పనాపత్తేః, "అభిదూతికా చిదితి సందిదిశే" ఇత్యత్ర "అభిదూతి దూత్యా స్సమీపే" ఇతి సమీపార్థే అవ్యయీభావసమాసస్య సిద్ధతయా దూత్యా స్సమీపే ఏవ మవదది త్యేవార్థః, నతు దూతీం అభిసారయతీతి, శ్రోత్ర పరంపరయా అవగతార్థస్సన్ ప్రియ ఏవాగ చ్ఛత్వి త్యభిప్రాయే ణోక్తం నాయికయా, ఏష ఏవ స్వారసికార్థః, ఏత త్సర్వం కడపనగరే ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహణోత్తరం సభాం కారయిత్వా బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయశాస్త్రిభిర్మయాచ సమ్య గేష ఏవార్థః ప్రత్యపాది.

శ్లో. విజయనగరవాసీ వేదశబ్దార్థశాస్త్రి కలన మతివిలాసీ కాశినాథో మనీషీ । అలిఖ దనుగుణార్థం శ్రీమదానందభూభృ ద్గజపతి రమణీయాస్థానమాన్య స్స ధన్యః.

ఏవం విజ్ఞాపయతి పే ర్యపనామక కాశీనాథవిద్వత్కవీంద్రః.

శ్రీమ ద్విజయనగరసంస్థానాధీశ్వర విద్యాశాలాధ్యాపకవరిష్ఠ శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారి యభిప్రాయము.—

విజయనగరము, 2 ఆగష్టు 1917.

తమరు మదరాసునుండి దయతో నంపినజాబు నాకుఁ జేరినది.

ఇందులో మొదటిది అభిసారికాలక్షణము.—

"కామార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా, (సం. ద. శూ. ౨ పరి. ౨౧ శ్లో) ఎవ్వతె కామపీడితురాలై స్వయముగాఁ గాంతునికడ కేగునో లేక వానిని దనయొద్దకు రప్పించుకొనునో అది యభిసారిక యని యీశ్లోకము నభిసారికాలక్షణము రెండురీతులఁ జెప్పఁబడినది. ఈదిగువ నుదాహరింపఁబడిన కొన్ని అలంకారగ్రంథ

ములలో నీలక్షణద్వయమును మరికొన్నిటిలో నొక్కలక్షణమును గన్ప ట్టించుచున్నది. ఎట్లనిన,

౧. సాహిత్యరత్నాకరము—"అనురక్తా స్వయం కాంతం యా తి యా సాభిసారికా"— వ్యా॥ అభిసారికాం లక్షయతి, అనురక్తేతి, స్మరార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారి కేతి ద్వివిధ మభిసర ణమ్, సారయే దితి, దూత్యాదిముఖే నేతి శేషః.

౨. ప్రతాపరుద్రీయము—"కాంతాభిసరణో ద్యుక్తా స్మరార్తా సాభిసారికా"— వ్యా॥ కాంతేతి కాంతస్య కర్మణః కర్తు ర్వాభిసరణే ఉద్యుక్తా, అత ఏవోక్తం, స్మరా ర్తాభిసరే త్కాంతం సారయే ద్వాభి సారికా, సారయే దితి దూత్యాదిముఖే నేతి శేషః.

3. సాహిత్యదర్పణము—"అభిసారయతే కాంతం యా మన్మథ వశంవదా। స్వయం వాభిసర త్యేషా ధీరై రుక్తాభిసారికా"

౪. హేమచంద్రాచార్యకృతకావ్యానుశాసనము — "అభిసర త్యభిసారయతి వా కామార్తా కాంత మిత్యభిసారికా"

౫. రుద్రటాలంకారశాస్త్రము—"అభిసారికాతు సా యా దూ త్యా దూతేన వా సహై కావా, అభిసరతి ప్రాణేశం కృతసంకేతా యథాస్థానమ్.

అభిసారికాలక్షణ మిది, కాని బ్రహ్మశ్రీ సూర్యనారాయణశా స్త్రిగా రపూర్వముగా గనిపెట్టిన "కాంతునిగూర్చి దూతిక నభిసరింపఁ జేయునది" అనులక్షణ మేయలంకారశాస్త్రప్రణేతయును వ్రాయ లేదు. ఇట్టి నవీనార్థకల్పనము కేవలానర్థపర్యవసాయి గాని వ్యుత్పన్ను లగువారికి సమంజసముగా గానరాదు.

ఇతరాక్షేపములలో.—

మూ. దశరూపానుకారేణ యస్య మాద్యంతి భావకాః నమః స్వర్వావిదే తస్మై విష్ణవే భరతాయ చ.

ఇందుకు శాస్త్రిగారియాంధ్రీకరణము.—

గీ. ఎవనిదశవిధరూపంబు లెదఁ దలంచి। అనుకరించియు సరసులు హాయి నుందురు. ఇచట "తలఁచి, అనుకరించి" అనుక్త్వార్థక క్రియలు రెండును "ఉందురు" అనునసమాపకక్రియతో సమాన కర్తృకములుగా బ్రయోగింపఁబడినవి. అనుకరించి, అనుదాని కభినయించి, అని అర్థము చెప్పవలెను. అభినయపర్యాయ మగు ననుకారము నటులయం దన్వయించును గాని సరసులతో సంబద్ధ మైనది కాదు. కావున ని ట్లాంధ్రీకరించుట సరిగా లేదు.

ఈపద్య మిట్లు సవరింపఁబడినయెడల బాగుగ నుండు నని తలంచెదను.

గీ. ఎవనిదశరూపకంబుల నెల్ల రసికు। లెదను భావించి సతతంబు ముదము గాంతు। రఖిలవిదుఁ డైన.

ఇఁక గ్రంథవిస్తర మేల? సంస్కృతదశరూపకము నాకు క్రొత్తగ్రంథము కాదు. బృహదుపాధిపరీక్షకుఁ జదువుబాలురకు ముప్పదియేండ్లనుండి ప్రతిసంవత్సరము పాఠముఁ జెప్పుచుంటిని. శ్రీశాస్త్రిగారియాంధ్రీకరణము, అందుపై నచ్చటచ్చట దమరుచేసినయాక్షేపములు, అసలు సంస్కృతదశరూపకమును మూఁడుదినములు సరిచూచితిని. శాస్త్రిగారియాంధ్రీకరణములో బహుస్థలములయందు మాతృకయొక్క అర్థమే సరిగా లేదు. మరికొన్నిచోట్ల నపేక్షిత మైనమూలపదములఅర్థమును విడిచి మరికొన్ని అనావశ్యకపదములు ప్రయోగింపఁబడినవి. సంస్కృతభాషాప్రవేశము గలవా రెవరైనను తమ రాక్షేపించినస్థలము లన్నిటిలో శ్రీశాస్త్రిగారు తప్పినా రని యొప్పుకొనక తీరరు.

ఇట్లు విన్నవించు తమప్రియమిత్రుఁడు,

మేడేపల్లి వేంకటరమణాచార్యులు.

విజయనగరము మహారాజావారికాలేజి.

**పీఠాపురాస్థానవిద్వాంసులును విజయదశమీ విద్వత్పరిషత్సమయసమ్మిళితు లైన యితరవిద్వాంసులును ఇచ్చిన అభిప్రాయములు.—**

ఆర్యాః!

తత్ర భవద్భిః ఆంధ్రదశరూపకవిమర్శే సయుక్తికం సప్రమాణంచ నిరూపితాః కతిపయపూర్వపక్షా స్సమ్య గస్మాభిః పర్యశీల్యంత. తత్రాస్మాక మయ మాశయః. "శ్లో. కామార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" ఇ త్యభిసారికాలక్షణే కాంతపదం అభిసరేత్ అభిసారయే ది త్యుభయత్రాన్వేతి, (స్వయం కాన్తం) అభిసరతి, అథ వా (కాంత) మభిసారయతీ త్యభిసారికా ఇతి వ్యుత్పత్తిద్వయ మపి మన్మహే, యాతు స్వయం కాన్త మభిసరతి, యాచ కాన్త మభిసారయతి సాభిసారికే త్యభిసారికాయా లక్షణద్వయం పర్యవసన్నమ్. లక్షణద్వయ స్యాస్య క్రమేణ.

"శ్లో. ఉరసి నిహిత స్తారో హారః కృతా జఘనే ఘనే కలకలవతీ కాంచీ పాదౌ రణన్మణినూపురౌ। ప్రియ మభిసర స్యేవ ముగ్ధే త్వ మాహతడిండిమా యది కి మధికత్రాసోత్కంపం దిశ స్సముదీక్షసే."

"నచ మేవ గచ్ఛతి యథా లఘుతాం కరుణాం యథాచ కురుతే సమయి। నిపుణం తథైన ముపగమ్య వదే రభిదూతి కాచి దితి సందిదిశే."

ఇ త్యేతత్ శ్లోకద్వయ ముదాహరణతయా వ్యాఖ్యాయా ముపన్యస్తమ్. అత్ర ద్వితీయలక్షణోదాహరణే దూతీ పదశ్రవణమాత్రేణ కాన్త మభిసారయతీత్యస్య వాక్యస్య కాన్తంప్రతి దూతీం ప్రేషయతీత్యర్థవర్ణనం త్వాంధ్రీకర్తుః ప్రమాద ఏవేతి వయ మన్యామహే. తథాహి, అభిపూర్వకసృధాతోః సంభోగేచ్ఛయా గమన మర్థ ఇతి సర్వై రపి ప్రామాణికై ర్విద్వద్భిరంగీకృతత్వాత్, కోశా ఽవిరుద్ధత్వాచ్చ, అభిసారయ తీత్యస్య ప్రేషయ తీత్యర్థవర్ణనం తు సుతరామప్రామాణికమ్. అత ఏవ వాచస్పత్యే బృహదభిధానే అభిసారశబ్దార్థ

నిర్వ్యూఢ త్వావసరే "అభిసారో నామ స్త్రియాః పుంసోవా సంభోగార్థం నిర్జనసంకేతస్థానగమనమ్, ఇత్యభిహితవాన్ పండితపుండరీక శ్రీతారా నాథ తర్క-వాచస్పతిః. అపిచ దూత్యాదీనా ముపాయత్వ మేవ శాస్త్రసమ్మతమ్, నతు తేషాం లక్షణకుక్షౌ ప్రవేశః. యద్యుపాయా నాం దూత్యాదీనా మపి లక్షణకుక్షౌ ప్రవేశః తదా ఉపాయభేదేన లక్షణానంత్యప్రసంగః. కించ దూతీపదాధ్యాహారోపి సర్వథా అప్రా మాణికః, అత ఏ వాగ్రే స్వయ మగమనా న్నాయకం ప్రత్యప్రయోజ కత్వా న్నాభిసారికాత్వ మితి గ్రంథేన స్వయం గమనం నాయకం ప్రతిప్రయోజకత్వం చే త్యుభయ మభిసారికాత్వ నిబంధన మితి, తదు భయాభావ స్తదభావే హేతు రితిచ గ్రంథకార ఏవ నిపుణ మావేద్ర యతి. సాహిత్యదర్పణ సాహిత్యరత్నాకర సింగభూపాలీయ ప్రతాప రుద్రీయాది ప్రామాణి కాలంకారశాస్త్ర నిబంధనగ్రంథపర్యాలోచన యా అభిసారికాలక్షణవిషయే భవద్భి రుట్టంకితః పూర్వపక్ష స్సర్వా త్మనా సయుక్తిక ఇతి వయం విశ్వసిమః.

(2) "ఆసన్నా యత్ర రమణా హృష్టా స్వాధీనవల్లభా".

ఇతి స్వాధీనపతికాలక్షణే అనాసన్నపతికాయాం వాసక సజ్జాయా మతివ్యాప్తి వారకతయా ఆసన్నపదస్య సార్థక్యసంభవే వ్యావర్తకం తద్విశేషణం పరిత్యజ్య అవశిష్ట లక్షణభాగ స్యాంగీకరణం తు నితరా మనాదరణీయమ్.

అత ఏవ దశదశరూపకే "నచ వాసకసజ్జాదే స్స్వాధీనపతికా ద్యా వంతర్భావః ఇతి పూర్వపక్షం కృత్వా పశ్చాత్ అనాసన్నపతి కత్వా ద్వాసకసజ్జాయా న స్వాధీనపతికాత్వ మిత్యుత్తరగ్రంథేన సమా హితవాన్.

(3) రసాశ్రయనిరూపణప్రస్తావే రసస్య కి మాశ్రయః, ఆహో స్వి దనుకార్యః? ఉతానుకర్తా? అథవా రసికా స్సామాజికాః? ఇ త్యాశంక్య అనుకార్యే అనుకర్తరి చ తై స్తై ర్హేతుభీరసాశ్రయతాం

నిషిధ్య సహృదయేషు రసాశ్రయతాం సిద్ధాన్తయాకార్షీ ద్దశరూపకే, త త్రాసుకార్యేషు దశరథాపత్యాదిషు రసో న వర్తతే, వృత్తత్వా ది త్యభిధాయ రసో రసికవర్తీ వర్తమానత్వాత్, ఇత్యనుమానేన వర్త మానత్వ హేతునా రసికానా మేవ రసాశ్రయత్వం సాధితం గ్రంథ కృతా. అత్రానుకార్యశబ్దః అతీతా న్దశరథాపత్యాదీ నభిధత్తే అను కర్తృశబ్దః రామాదివేషధారిణో నటాన్ బోధయతీ త్యయ మంశ స్సర్వసంప్రతిపన్నః నిర్వివాదశ్చ. అతఏవ కావ్యోపప్లావితః నిర్భరా నందసంవిదాత్మతా మాపాద్యమానోరసః రసికవర్తీ వర్తమానత్వాత్, ఇతి, నకావ్యం రామాదీనాం రసోపజననాయ కవిభిః ప్రవర్త్యతే, అపితు సహృదయా నానందయితు మితిచ దశరూపకే వక్ష్యతి. ఏవం స్థితే అనుకార్యశబ్దస్య రామాదివేషధారి నటరూపవిరుద్ధా ఽప్రామా ణికార్థవాచక త్వోపవర్ణనం త్వాంప్రికర్తు ర్భ్రాంతిమూలక మే వేతి వయం యుక్త ముత్పశ్యామః.

విజయదశమీ విద్వత్పరీక్షాది కార్యగౌరవేణ సమయస్యా ప ర్యాప్తతయా సర్వేషాం భవదీయపూర్వపక్షాణా ముప న్యస్త దభి ప్రాయనివేదనే వయం నపారయామ ఇతి విజ్ఞాపయితుం నితరాం చిం తయామః. పరంతు తత్ర భవద్భి రుట్టంకితాః ఆంధ్రదశరూపకపూర్వ పక్షాః సర్వేపి ప్రామాణికాలంకారశాస్త్రవిద్వజ్జనసమ్మతాః స్వయం ప్రామాణికాశ్చేతి సశపథం సబహుమానం చావేదయామః. అపిచ శ్రీజట్రప్రోలుసంస్థానాధీశ్వరాణా మనన్యసాధారణీం విద్యావినోదరసి కతాం సాధు బహుమన్యామహే ఇతి శివమ్.

1. శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రీ.
2. దెందుకూరు నరసింహశాస్త్రీ.
3. వడలి లక్ష్మీనారాయణశాస్త్రీ.
4. గోరుగంతు వెంకటరామశాస్త్రీ.

ఆస్థానవిద్వాంసులు, పిఠాపురము.

5. గంటు సూర్యనారాయణశాస్త్రి.

ఆస్థానవిద్వాన్, విజయనగరము.

6. మాచనవఝ్ఝుల సూర్యనారాయణశాస్త్రి.

దుళ్లఅగ్రహారము.

7. అద్దెంకి రంగనాథాచార్యులు.

శిరిపురముజమీన్దారువారి ఆస్థానవిద్వాన్

8. కుమారభట్టరు అప్పలాచార్యులు.

విద్వాన్ వడ్డాదిఅగ్రహారము.

శ్రీమత్పితాపురసంస్థానవిద్వద్వరేణ్యు లగు శ్రీ వంగల రామలింగశాస్త్రులవారియభిప్రాయము.—

"మహారాజరాజశ్రీ శ్రీమ జ్జటప్రోలుసంస్థానాధీశ్వరు లగు శ్రీ శ్రీరాజా వేంకటలక్ష్మారావు బహాదుర్ నిజాం నవాజువంతువారిదివ్యసమ్ముఖమునకు.

గోదావరిజిల్లా పిఠాపురవాస్తవ్యుఁ డగు వంగల రామలింగశాస్త్రి సవినయప్రార్థనాపురస్సరంబుగ వ్రాసికొని పంపుకొనిన విజ్ఞాపనము.—

మహారాజేంద్రులారా!

బ్రహ్మశ్రీ మల్లాదిసూర్యనారాయణశాస్త్రిగా రాంధ్రీకరించిన యాంధ్రదశరూపక మనుగ్రంథముపై ప్రకటించి తాము శ్రీసముద్రాల వేంకటఅప్పలాచార్యులవారిద్వారా పంపించిన తద్విమర్శన తత్ఖండన తత్ఖండనాభాసనిరాసాదిగ్రంథము లన్నింటిని సావధానచిత్తముతో సంస్కృతదశరూపకమును గూడ నెదుట నుంచుకొని పరిశీలించి చూచినాఁడను. తమసంస్థానపండితవర్యు లైన బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రిగారిచే వ్రాయఁబడిన తద్విమర్శగ్రంథోద్దిష్టము లైన యాక్షేప

స్థలముల నన్నిటిని పరిశోధింపగ, నాయాక్షేపము లన్నియు న్యాయ్య ము లైనవి యనియు, నాయాస్థలములయం దైన యాంధ్రీకరణములు నిర్మూలము లైనవి యనియు, కర్తృదుర్విజ్ఞానబోధకంబు లైనవి యని యు స్పష్టముగ దెలియుచున్నది.

లక్షణగ్రంథముల కెప్పుడును మూలమునకు ప్రతిబింబముగనే భాషాంతరీకరణము జేయవలయును గాని మూలవిరుద్ధోక్తులతోడను న్యూనాధికోక్తులతోడను భాషాంతరీకరణము చేయగూడదు. అట్లు చేసినయెడల నట్టిగ్రంథములు లోకపరిగ్రాహ్యములు గావు. తాము పంపినగ్రంథములను బట్టి యీ యాంధ్రదశరూపకముపై నాకు గూడ దోచిన కొన్ని సంగతుల నీక్రింద విశదపరుచుకొను చున్నాడను.

ఆంధ్రీకర్తగా రభిసారికాలక్షణవాక్యములోని రెండవలక్షణము నాంధ్రీకరణములో జేర్పకుండుట, వారికి ప్రథమములో నది రెండవ లక్షణముగా స్ఫురింపకనేమో యని యూహింపవలసి యున్నది. తర్వాత శ్రీసదాశివశాస్త్రిగారు దానిని, కదపినతోడనే యప్పటి కది రెండవలక్షణముగ గ్రహియింపబడి యప్రసిద్ధలక్షణ మనియు, గ్రంథ విస్తరభీతి యనియు, భంగ్యంతరోక్తులచే తమపొరపాటును కప్పుకొన బూనిరి గాని యిది న్యాయ్య మైనయుక్తి యని నాకెంతమాత్రము తోచదు. అంతటి మహాగ్రంథము నాంధ్రీకరించుటకు బూనినయాంధ్రీకర్త గారి కీయత్యల్ప మైన "సారమేద్యా" యను నొకవాక్యమును దెలి గించుటలో గ్రంథవిస్తరభీతి యైన దని వదలివేయుటకు జెప్పినకారణ మేమి తృప్తికరముగ నున్నది? అప్రసిద్ధత్వముచే నాంధ్రీకరించలే దని చెప్పినకారణము మాత్ర మేమి విశ్వసనీయముగ నున్నది? అప్రసిద్ధ లక్షణ మని మూలగ్రంథకారు డేల యాలక్షణవాక్యమును వదల గూడదు? ఇది యంతయు నాంధ్రీకర్తగారియొక్క మూలగ్రంథావ గాహన వైధుర్యవిలసితమే గాని మరియొకటి గా దని సహృదయులకు దోపక మానదు.

శ్రీసదాశివశాస్త్రిగారు "కామార్తా" యనేది మూలమందున్న స్త్రీయుని నభిసరింపఁజేయునది కూడ నభిసారిక యని చెప్పి యుండఁగా దాని నేల తాము విడిచితిరి. యని యాంధ్రీకర్తగారికి మృదువుగ వ్రాసినపుడు పైనుదాహరించిన యేవేరిమెుక్రియుక్తులనో, సహా భాసముగా జెప్పి యంతటితో నూరకుండక ఆంధ్రీకర్తగారు, తమపాండిత్యాविశేషద్యోతనార్థమై లక్షణములోని రెండవభాగమున కిది యర్థము కాదనియు, కాంతునిగూర్చి దూతిక నభిసరింపజేయునది. యని దాని యర్థ మనియు, రసజ్ఞశిఖామణు లైన శ్రీసదాశివశాస్త్రిగారివిజ్ఞాపనమును నోల్లుంఠనము జేయుట, గిల్లి జగడము తెచ్చుకొనుటయే కాక, స్వపాండిత్యావివేకములను దేశవిదితములనుగ జేసికొనవలసి వచ్చినది.

అందుచే "శ్లో. జ్వలతి చలి తేంధ నోగ్ని ర్విప్రకృతః పన్నగః ఫణాం కురుతే, ప్రాయ స్స్వ మహిమానం క్షోభా త్ప్రతిపద్యతే హి జనః" అనునట్లు శ్రీసదాశివశాస్త్రిగారిపాండితీమహిమ నాంధ్రీకర్త గారిపై జూపవలసి వచ్చినది. ఇందులో శ్రీసదాశివశాస్త్రిగారు చెప్పిన యర్థమె సరియైనది గాని యాంధ్రీకర్తగారు చెప్పినయర్థము సరియైనది గాదు.

"శ్లో. కామార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" యను మూలగ్రంథలక్షణవాక్యమును, న్యాయముగ నన్వయింపవలసి వచ్చినచో నావాక్యములో ద్వివిధలక్షణములు చెప్పఁబడినవి గావున రెండువాక్యములుగా దాని నన్వయింపవలసి యున్నది "కామార్తా సతీ యా కాంత మభిసరే త్సైకవిధాభిసారికా" యని యొకయన్వయమును, ఇక "సారయే ద్వా" అను రెండవవాక్యములోనికి మూలమందు పూర్వనిర్దిష్టము లైన "కామార్తా, కాంతమ్" అనుపదములు కిమూడులచే నాకాంక్షితములు గనుక వానిని అనువృత్తి జేయుగ "కామార్తా సతీ యా కాంత మభిసారయే త్సా ద్వితీయవిధాభిసారికా" యని ద్వితీయవాక్యాన్వయమును జేయఁదగి యున్నవి. ఇట్లు

కర్తృకర్మక్రియలతో ద్వితీయవాక్యాన్వయము పదాంతరాకాంక్ష యక్కఱ లేకుండఁ జక్కఁగఁ గుదురుచుండఁగ, మూలమునం దెచ్చటను బూర్వనిర్దిష్టము గాని "దూతీమ్" అను ననాకాంక్షితపద మెట్లాకర్షింపఁబడి యీయన్వయములోనికిఁ జేర్చవలసి యున్నది? అట్లు చేర్చి యన్వయించుట కేమి యవసరము వచ్చినది? పూర్వసూత్రగృహీత పదముల నుత్తరసూత్రపదములోనికి వాక్యార్థము సరిపుచ్చుకొనుట కనువృత్తిఁ జేసి సమన్వయించుట శాస్త్రజ్ఞులసంప్రదాయము. అనువృత్తపదములతో వాక్యాన్వయము సరిపడినపు డాయిరుగుపొరుగున నెచ్చటను నిర్దిష్టము గానట్టియు ననపేక్షిత మైనట్టియు "దూతీమ్" అనుపదమును నిరర్థకముగా నాకర్షించి తదన్వయములోఁ జేర్చి యన్వయించినందువలనఁ బ్రయోజనము లేకపోవుటయు, నర్థవైచిత్రి లేకపోవుటయుఁ గలుగుచున్నవి.

నాయికానాయకు లిరువురిలో నెవ రభిసరించిన నానాయిక యభిసారిక యగు నని మూలలక్షణాభిప్రాయముగాని, దూతి నభిసరింపఁ జేయుటవలన నాయిక యభిసారిక యగు నని మూలాభిప్రాయము గాదు. అభిసరణము దూతీనిష్ఠ మైనపుడు దూతియే యభిసారిక గావలసి వచ్చును. అందువలన వైరస్యము గూడ సంభవించును. కాంతపద ముభయాన్వయి యని యంగీకరించినపు డేకకర్తృకాన్వయముచేతనే వాక్యార్థబోధ చక్కఁగ నగుచుండఁగ ననాకాంక్షిత మైన "దూతీ" మను కర్త్రాంతరమును జేర్చి దూతి నభిసరింపఁజేయున దను స్వారస్యము లేనియర్థముఁ జెప్పుట రసాజ్ఞాననిబంధనము. అందువలన నన్వయగౌరవమును, ఐనను, స్వారస్యము లేకపోవుటయుఁగూడ గలుగుచున్నవి.

వ్యాఖ్యానోదాహృత లక్ష్యశ్లోకమును బట్టి లక్షణము నట్లన్వయించుట యుచిత మని యాంధ్రటీకకర్తగారు చెప్పినమాటయు నిస్సార మైనది. లక్షణమునుబట్టి లక్ష్యమును సమన్వయింపవలయును గాని, వ్యాఖ్యాత యెచ్చటనుంచియో దెచ్చి యుదాహరించినలక్ష్యశ్లోకమును

బట్టి లక్షణము నన్వయించుట న్యాయము గాదు. ఒకవేళ న్యాయ మని సాధించినను, లక్ష్యశ్లోకమును బట్టియు న ట్లన్వయింపవలసియున్నట్లు గాన్పించదు. లక్ష్యమునందుఁ గాంతుని రావింపవలె నని చెప్పి దూతిక నంపిన ట్లున్నది. అనఁగ, కాంతాగమనమువిషయమై దూతిని సాధన ముగాఁ జేసికొనిన ట్లున్నది కాని మఱియొకలాగున లేనేలేదు. "కరుణాం యథాచ కురుతే సమయి, నిపుణం తథైన ముపగమ్యవదేః" అను లక్ష్యశ్లోకవాక్యములను బట్టి, తనయందు కాంతున కెట్లు దయ గలుగునో యట్లు చెప్పు మని నాయిక చెప్పిన ట్లున్నది. కాంతునికి దయ గలుగుట యనఁగఁ దనకోరికప్రకారము దనయింటికి వచ్చుటే యని లక్ష్యశ్లోకతాత్పర్యము గాని వేఱొకటి గాదు. ఇందువలన దూతి కాంతానయనమందుఁ గరణ మగుచున్నది గాని యభిసరణకర్త్రి గాలే దని స్పష్టము. కావున "అభిసారయేత్" అనుక్రియకు, కాంతుఁడె కర్త యగుచున్నాఁడు. "దూతీ" మ్మను కర్త్రాంతరాకాంక్ష యచటఁ బుట్టుటే లేదు. మూలవ్యాఖ్యాత యైనధనికుఁడును "కామార్తాయా దూత్యాదిముఖేన కాంత మభిసారయే త్సా ద్వితీయవిధాభిసారికా" యని దూతీకరణక కాంతానయనతాత్పర్యముతో లక్షణానుగుణ్యము గనే లక్ష్యోదాహరణము నిచ్చినాఁడు గాని "దూతీం సారయేత్" అను భిన్నాభిప్రాయముతో గాదు.

ఎట్లయిన నాంధ్రీకర్తగారు తమయన్వయమునె మూలవ్యాఖ్యాత్రభిమత మైనదానినిగా సాధించెద మని, తమపట్టును దాము విడువనపు డుభయవాదములలో నేది న్యాయ్య మని వివాదము పరిష్కరింప వలసి వచ్చెను. కావున నిచ్చట నాలంకారికు లైన విద్వాంసులును, బ్రమాణాంతరములును, బ్రతిభూత్వమును బొందవలసి యుండుట న్యాయము. అందు కాలంకారికశిరోమణు లైన విద్వాంసులందఱును బ్రామాణికవాదధురంధరు లైన శ్రీసదాశివశాస్త్రిగారిపక్షము న్యాయ్య మైన దని చెప్పక మాన రస నాయిభిప్రాయము. ప్రమాణాంత

రములును శ్రీసదాశివశాస్త్రిగారివాదముననే యనుకూలించి యున్నవి గాని యాంధ్రటీకర్తగారివాదమున కనుకూలించి యుండ లేదు.

సింహభూపాలీయ మను రసార్ణవసుధాకరమునందు, శ్లో "మదనానలసంతప్తా యాభిసారయతి ప్రియమ్ । స్వయం వాభిసరే ద్యాతు సా భవే దభిసారికా" యని యభిసారికాలక్షణవాక్యము. ఇచ్చట "ప్రియ మభిసారయతి" యనుచోట "దూతీ" మ్మను రెండవకర్తృపదమును నిర్దేశించుట లేదు. కథ మభిసారయతి? యను నాకాంక్షచే దూత్యాదినా యను తృతీయాంతదూత్యాదిపదమె యధ్యాహార్య మని మూలవచనాభిప్రాయము. ఇచ్చట (గ్రంథకర్త కభిసరణకర్త్రి) దూతియే యని యభిప్రాయ మున్నయెడల "స్మరాగ్నిపీడితాదూతీం యాభిసారయతి ప్రియమ్" అని ప్రతిపదోక్తముగ "దూతీమ్" అను పదమును జేర్చి లక్షణశ్లోకమును వ్రాయవచ్చును. అట్లు వ్రాయక "యాభిసారయతి ప్రియమ్" అని వ్రాయుటవలన అభిసరణకర్త కాంతుఁడే గాని దూతిక గా దని నొక్కి చెప్పవలసి యున్నది. రసమంజరి యందును "స్వయ మభిసరతి ప్రియ మభిసారయతి వా యా సాభిసారికా" యనుచోట దూతిని కర్తగా గ్రహింపు మని యుపదేశింప లేదు. విశేషించి, యందలి మకరంద మను వ్యాఖ్యానమునందు దూత్యాదులకుఁ గరణత్వము నంగీకరించి "అభిసారయతి దూత్యాదిముఖేన ప్రియమానయ తీత్యర్థః" అని వ్రాయఁబడినది గాని "దూతీ మభిసారయతి" యని యన్వయించి వ్రాయఁబడ లేదు.

సాహిత్యరత్నాకరవ్యాఖ్యలో నాలంకారికచక్రవర్తి యని బిరుదము నొందిన మల్లాదిలక్ష్మణసూరి "స్మరార్తాభిసరేత్కాంతం సారయే ద్వాభిసారికా" యను దశరూపకవాక్యమునె యుదాహరించి "ద్వివిధ మభిసరణం సారయే దితి దూత్యాదిముఖే నేతి శేషః" అని దూత్యాదులకుఁ గరణత్వమునే యంగీకరించి తృతీయాంతదూత్యాదిపదమునే యధ్యాహారముఁ జేసినాఁడు. షడ్దర్శనపారదృశ్వ యగు మహాకవి యా

ణివిళ్ళ వేంకటశాస్త్రి రచియించిన, అప్పారాయయశశ్చంద్రోయ మను నలంకారగ్రంథమునందుఁ దృతీయకళలో "కాంతార్థినీతు యాయాతి సంకేతం స్వయ మాకులా। కాంత న్నయతి వా తత్ర సైవస్యా దభిసారికా" యని దూత్యాదులచేఁ గాంతుని సంకేతస్థలమునకు రావించు నదియే ద్వితీయాభిసారిక యని వక్కాణించినాఁడు. ఇచట గ్రంథకర్త కభిసరణకర్త్రి దూతియే యని తలంపున్న యెడల "దూతీ" మను పదమును జేర్చి లక్షణశ్లోకమును సూర్చి వ్రాయవచ్చును. ఆతలంపు లేనంగువలన నట్లు వ్రాయ లేదు.

ఇట్లు ప్రమాణాంతరము లన్నిటిలోను దశరూపకవాక్య మేక వాక్యత నొంది యుండ నాలంకారికశిరోమణియు రసజ్ఞుఁడు నగుధని కుఁడుమాత్రము భిన్నాభిప్రాయవంతుఁ డగునా? కాఁడు. కావుననె "ఆసా మష్టావవస్థా స్స్యుః" అనుశ్లోకము క్రింద "స్వయ మగమనాన్నా యకం ప్రత్యప్రయోజకత్వా న్నాభిసారికాత్వమ్" అని వ్రాసినవాఁడు. ఇందువలన, స్వయంగమనము నాయకాగమనప్రయోజకత్వము అను నీరెండే యభిసారికాత్వప్రయోజకము లని యేర్పడినది. కాఁబట్టి ధని కుఁడు కాంతానయనమందు దూతిని సాధనముగా నెంచి తదుద్దేశముతో లక్ష్యశ్లోకము నుదాహరించెను గాని యాంధ్రీకర్తగారు చెప్పినట్లు గాదని ముమ్మాటికిం జెప్పవచ్చును. ఆంధ్రీకర్తగారు తాము చేసినయన్వ యమందలి రసవిశేషమును దామే యాస్వాదించిన బాగుండును గాని యేతాదృశరసాస్వాద మెఱుఁగని రసికుఁ డైన యాధనికునికిఁ గూడ నిదియే తాత్పర్య మని తనతో ధనికుని సమానునిఁ జేయుట న్యాయోప మాన మని నాతాత్పర్యము.

మఱియుఁ బ్రామాణికోత్తంసు లైన శ్రీసదాశివశాస్త్రిగారు విమర్శించినరీతిని "నానుకార్యరామాదివర్తీ వృత్తత్వా త్తస్య యది చానుకార్యస్య రామాదే శ్శృంగారస్స్యా" దిత్యాదివాక్యములయాం ధ్రీకరణముఁ జూడ నాంధ్రీకర్తగారి కనుకార్యానుకర్తృశబ్దముల కర్థమే

గోచరము గాలే దని చెప్పవలయును. "కించ న కావ్యం రామాదీనాం రసోపజననాయ, అనుకార్యస్య రామాదేః" అనువాని తెలిగింపుఁ జూచిన నాంధ్రీకర్తగారి కలంకారశాస్త్రానభిజ్ఞత స్పష్టము.

"సత్పురుషాణాంచ ల జ్జేతరేషామ్" అనువాక్యమునకు బదచ్ఛేద మైనను దెలిసికొనలేక చేసినయాంధ్రీకరణముఁ జూడ లజ్జాస్పదమగుచున్నది.

"పూర్వోక్తానాం చతుర్ణాం ప్రత్యేకం చతురవస్థత్వే షోడశధా నాయకః" అనువాక్యమునకు ఒక్కొక్కనాయకుఁడు పదునాఱువిధములగుచున్నాఁడు" అని వ్రాసినయాంధ్రముఁ జూడ నవ్వు వచ్చుచున్నది.

"ధన్న కామ సుఖార్థాజ్ఞే" త్యాదివాక్యముల తెలుఁగుఁ జూడ నాంధ్రీకర్తగారికి, సమాసజ్ఞానశక్తియు శబ్దముల కర్థకల్పనాశక్తియు లోకశాస్త్రవిలక్షణము లైనట్లు గానంబడుచున్నది.

"నృత్తే గాత్రవిక్షేపార్థకత్వేన" యని మొదలగు చాలచోట్ల వ్రాయఁబడినయాంధ్రీకరణముఁ జూడ నాంధ్రీకర్తగారికి సంస్కృతభాషాజ్ఞానమే సరిగ లేక వ్రాసినట్లు స్పష్ట మగుచున్నది.

ప్రత్యేకించి వాని నన్నిటి నుదాహరించినయెడల గ్రంథవిస్తర మగుచున్నది. శ్రీసదాశివశాస్త్రిగా,రుద్ఘాటించినతప్పు లన్నియు న్యాయ్యము లైనవియుఁ బ్రామాణికవిద్వత్సమ్మతము లైనవియు నై విరాజిల్లుచున్నవి.

దశరూపకము నాంధ్రీకరించువారికి పూర్ణ మైన సంస్కృత భాషాజ్ఞానము, రసజ్ఞానము, వాక్యసమన్వయశక్తి, ఆలంకారికసమయ పరిశీలనము, చక్కనిసాహిత్యము మొదలగు తదుపయోగిసామగ్రి యుండవలెను. అట్టిసామగ్రి యీయాంధ్రీకర్తగారికి బొత్తిగఁ దక్కువగ నున్న దని యీయాంధ్రదశరూపకమును జూచినవారి కెల్లఁ దేటపడక మానదు. ఇట్టిశక్తిగలవా రిటువంటిమహాగ్రంథమును దెనిఁగింపఁబూను

సాహసవృత్తి కవలంబించుట హాస్యాస్పదమై యపకీర్తికి హేతువైన దని నాయభిప్రాయము.

కావున నాంధ్రీకర్తగారు తమయాంధ్ర దశరూపకములోని తప్పులు మూలమునకు విరుద్ధముగఁ బలుచోట్ల స్పష్టమై కాన్పించుచున్నపుడును, అట్టి తమగ్రంథములోనితప్పులను దిద్దికొనవలయు నని శ్రీసదాశివశాస్త్రిగారు మున్నగుపండితప్రకాండు లుద్ఘోషించుచున్నపుడును, అందు కొప్పుకొనక నెవ్వెవ్వియో సందర్భరహితవాక్యములతో వితండావాదముల సలుపుచు దమయాంధ్రీకరణమే సరియైన దనియు, ఆక్షేపములు దురాక్షేపము లనియు సమర్థింపఁ బూనుట మిగుల హేయముగా నున్నది. ఆంధ్రీకర్తగారీపట్ల నహంకారాభిమానముల నుంచుకొనఁగూడదు. "శ్లో. ప్రమాదో ధీమతా మపి" అను న్యాయముచే నెంతటివిద్వాంసులకైనను బ్రమాదము రాక మానదు. కావునఁ దద్యాథార్థ్యము పండితులచేఁ జూపఁబడినపు డందు కొప్పుకొనుట మిగుల శ్రేయంబు. లేనిచోఁ దమపాండిత్యమునకును బ్రామాణికతకును గీర్తికిని గూడ భంగము గలుగును. కావున వీరు(సూర్యనారాయణశాస్త్రిగారు)కీర్తి వచ్చినను నపకీర్తివచ్చినను దశరూపకాంధ్రీకర్తగా రని యొకపేరుఁ బెట్టుకొని యున్నారు గనుక న్యాయమునకు లోఁబడి మరల దశరూపకమును సద్విద్వజ్జనసహాయముచే మూలానుగుణ్యముగ సరిగ నాంధ్రీకరించి సుపరిశీలితము లైన ద్వితీయముద్రణగ్రంథములనే దేశమున వ్యాపింపఁ జేసినయెడల లోకోపకార మగు నని నేను దలంచుచున్నాఁడను.

ఇటువంటి విద్యావిమర్శములచే వినోదము నొందుచున్న శ్రీప్రభువువారి రసికత్వమునకు మిగుల నానందించుచున్నాఁడను.

దివ్యచిత్తమునకుఁ దేవలయును.

పింగళసంవత్సర కార్తిక బహుళసప్తమీ బుధవారము. } వంగల రామలింగశాస్త్రి. పిఠాపురము, గోదావరిజిల్లా.

శ్రీపీఠాపురసంస్థానవిద్వాంసు లగు శ్రీ పేరి పేరయ్యశాస్త్రిగారియభి
ప్రాయము.—

భవత్కృతాన్ధ్రదశరూపకవిమర్శ మపశ్యమ్. ఆన్ధ్రదశరూప
కం తత్ర తత్ర సంస్కృతదశరూపకా ద్భిన్న మేవ దృశ్యతే. ఇతర
గ్రన్థవిరుద్ధంచేతి ప్రతిభాతిమే. బ్రహ్మశ్రీ పేరి కాశీనాథశాస్త్రిభిర్దర్శితో
విరోధః మహ్యాపి స్ఫుర త్యేవేతిశమ్.

ఏవం విజ్ఞాపకః.
పేరి పేరయ్యశాస్త్రీ.
ఆర్. సి. హెచ్. హైస్కూల్ ఉపాధ్యాయః,
పీఠాపురమ్.

(బ్రహ్మశ్రీ పేరి కాశీనాథశాస్త్రిగారు ఆంధ్రదశరూపకగ్రంథము
నందు కనఁబరచినదోషములు నాకున్ను అభిప్రేతములే.)

పసుపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి.
గుడివాడతాలూకు, పిచ్చికలపాటిఅగ్రహారం,
కృష్ణాజిల్లా.

శ్రీపీఠాపురసంస్థానాస్థానపండిత శ్రీమద్రామకృష్ణవిద్వత్కవివరులయభి
ప్రాయము.—

1-9-1917. పీఠాపురము.

బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రులవారీనాఁడు మాకు దర్శన
మిచ్చి తాము రచియించిన యాంధ్రదశరూపకవిమర్శమునందలివిషయ
ములను గొన్నింటిని వినిచిరి. పిదపఁ దమవిమర్శముపై మహామహో
పాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రులవారు మున్నగువారొసంగిన
యభిప్రాయపత్రికలను జూపిరి. ఇంతకు మున్నొకప్పుడు బ్ర-శ్రీ,
మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారును దమదశరూపకవిమర్శఖం
డనము ప్రతి నొకదానిని మా కొసంగి యున్నారు. అందు శ్రీసదా

శివశాస్త్రులవారియాక్షేపములు గాని సమాధానములు గాని తిన్నఁగా వ్రాయఁబడి యుండక పోవుటచే నది యేమో యనుకొంటిమి. శ్రీ సదాశివశాస్త్రులవారు తెలిపినయాక్షేపములను సవరించుకొనుటయే యుత్తమ మనియును, అంతమాత్రమున శ్రీసూర్యనారాయణశాస్త్రుల వారికి లోప ముండ దనియును మే మిప్పుడు భావించుచున్నాము.

రామకృష్ణకవులు.
పిఠాపురసంస్థానవిద్వత్కవులు శతావధానులు.

శ్రీపీఠాపురసంస్థానాస్థానపండిత శ్రీగుడిమెళ్ళ తిరుమలవేంకటరంగాచార్యాణా మభిప్రాయః.—

శ్రీ వెల్లాల సదాశివాహ్వావిదుషా హృద్యో విమర్శః కృతస్సద్యో ఽసద్గ్రంథి తావమర్శన పటు ర్జాగ ర్తి దోషోఝ్ఝితః। ఏతన్మూలమపాస్తమూల మపి చోన్మూలం స్ఫుర త్యంజసా సావద్యం విదుషాన్నహృద్య మితిమే ధీ ర్నత్ర నో ద్వాపరః.

వ్యలిఖదిత్యేవ మభిమత మత్ర
2-9-1917. పీఠాపురమ్. గుడిమెళ్ళ తిరుమలవేంకటరంగాచార్యః,
పీఠాపురమహాసంస్థానాస్థానవిద్వాన్.

శ్రీపీఠాపురసంస్థానాస్థానపండిత శ్రీపురాణ పండా మల్లయ్యశాస్త్రిగారి యభిప్రాయము.—

తమరు ప్రేమపూర్వకముగా వ్రాసినయుత్తరము నల్లే పంచిన యాంధ్రదశరూపకవిమర్శనగ్రంథము నందినవి. నే ననారోగ్యస్థితియం దుండుటచే నాపుస్తకమును మొదటినుండి కడవఱకుం జదువలేక పోయితిని. కాని యందు మీరు కావించినకొన్నియాక్షేపణములను జూచితిని. నేఁ జూచిన యాక్షేపణము లన్నియు సయుక్తికములును శాస్త్రసమ్మతములు నని నాబుద్ధికిఁ దోఁచిన దని మనవి చేయుచున్నాను.

నే నాపొత్తమునంతను జూచి వ్రాయనందులకును నాలస్యము చేసి వ్రాసినందులకును నన్ను క్షమింప వేఁడికొను చున్నాను.

16-11-1917. }
పీఠాపురము. }

పు. మల్లయ్యశాస్త్రి.

శ్రీపీఠాపురసంస్థానవిరాజమాన కవివర శ్రీయుత ఉమర్ అలీషాగారి యభిప్రాయము.—

మహాశయా!

తమరు కృపామతి నొసంగినపుస్తకములు చదివితిని. అందు ఖండనాభాసనిరాసము మిగుల యుక్తియుక్తముగా నున్నది. మఱియు శాంతవచనములతో మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి కొసంగిన సదుపదేశము తమమహాశయత్వము చెప్పక చెప్పుచున్నది. తమబోంటి మహనీయగుణగరిష్ఠులు ఆంధ్రమాతకు గారాబుకొమరులు. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిని నే నిదివఱ కెఱుంగుదును. వెనుక వీరి "సత్యకీర్తి" విమర్శించినప్పుడు ఔచిత్యాదిలక్షణములు మిగుల కొఱ వడి రసాభాసముగ నుండెను. వీ రింకను పండితులయొద్ద చక్కఁగా శిక్షితులై తరువాత దశరూపకాదిలక్షణగ్రంథము లాంధ్రీకరించుట సమంజస మని తోఁచెడిని.

లక్షణములు మున్నగుశాస్త్రగ్రంథములం దేమాత్రము లో టున్నను లోకము దుర్భ్రమను జెందును. అది యెంతయు గర్హ్యమైనపని. చిత్రలేఖకుఁ డొకపటము వ్రాసినప్పు డేవర్ణము కొఱంత చేసినను లోకము నిందింపక మానదు. అట్లు నిందించుటకు వ్రాసిన వ్యక్తియందు విరోధ మనగత్యము. కావున మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారికి పండితు లిచ్చెడు నుద్బోధము వారిపురోభివృద్ధికిఁ దోడ్పడు నని నాయభిప్రాయము.

ఆ-గీ. కార్యగతులలోని కలరూపు సెప్పిన, 'నధికమతులు
దాని నాదరింతు । రల్పభాగ్యబుద్ధు లగువారలకు నది, విరసకారణంబు
విషమువోలె. అని భారతము.

చిత్తగింపవలయును.

24-1-1918.
పీఠాపురము.

విధేయుఁడు,
ఉమర్ అలీ షా.

కాకినాడలో శ్రీబొమ్మకంటి నృసింహశాస్త్రిగారి యభిప్రాయము.—

మహారాజరాజశ్రీ శ్రీమత్కొల్లాపురప్రభువర్యులవారిసముఖ
మునకు బొమ్మకంటి నృసింహశాస్త్రి చేయు విజ్ఞాపనము. తమయాశ్రి
తులు వెల్లాల సదాశివశాస్త్రులవారు ది 2-9-17 తేది కాకినాడలో
మాలోపల నాకు దర్శన మిచ్చి బ్ర-మల్లాది సూర్యనారాయణశాస్త్రుల
వారు రచించిన దశరూపకాంధ్రగ్రంథమును, తాము విమర్శించినయం
శములను నాకు గన్పరచగా వేరె పండితాంతరులసంవాదములను పరా
మర్శించకయే స్ఫురించినవిషయ మే మన, సంస్కృతదశరూపకము
కును దానియాంధ్రీకృతికిని జాలవైషమ్య మున్నట్లు బుద్ధి దృఢ మైనది.
ఇట్టి నాస్ఫూర్తికి దగినకారణములను వివరించవలయు నన్నచో నట్టి
సమయమును బట్టి యందుకు సన్నద్ధుడను కాగలను. ప్రామాణికులకు
శాస్త్రమే దైవము గాని యితరకారణములు గా వని యిందుమూల
ముగ విన్నవించెదను. దివ్యచిత్తమునకు దేవలయును.

2-9-1917.

బొమ్మకంటి నృసింహశాస్త్రి.

ఈయాంధ్రదశరూపకవిమర్శమును నేను లెస్స పరిశీలించితిని.
శ్రీబొమ్మకంటి నృసింహశాస్త్రులవారియభిప్రాయముతో నాయభిప్రాయ
మేకీభవించుచున్నది.

కురుగంటి లక్ష్మీనారాయణశాస్త్రి,
గిద్దలూరు.

కడియములో శ్రీమద్వివద్వ చ్ఛతావధాను లగు చెళ్ళపిళ్ళ వేంకటశా స్త్రిలగారి యభిప్రాయము.—

తాము సుమారు రెండుమాసములకు మున్ను పంపిన ఆంధ్ర దశరూపకవిమర్శనమును ప్రత్యక్షరమును జదివితిని. మరల నీమధ్య నంపిన ఖండనాభాసనిరాసము గూడ సగము సుమారు పఠించితిని. దీనియందు ,తా ముదాహరించినపండితాభిప్రాయములం గాంచితిని. వే యేల ? ప్రకృతచర్చావిషయమున తాము పొందినపొరపాటును గ్రంథకర్త పొందని పొరపాటును నాకు మందున కేని గానరా దని సూత్రప్రాయముగ విన్నవించు కొనుచున్నాఁడను. ఇంతమాత్రముచే గ్రంథకర్త కేవలశోచ్యుఁ డని నాయభిప్రాయము కాదు. కాని దశ రూపకమువంటిలక్షణగ్రంథము నాంధ్రీకరించుటకుఁ గాని మీవంటియభి జ్ఞులతో వాదప్రతివాదము లొనర్చుటకుఁ గాని తగఁ డనిమాత్రము వ్రాయక తప్పదు. ఇతర చర్చలవఱ కెందులకు ? మొట్టమొదట వివా దకు బీజ మైన యభిసారికాలక్షణమున గ్రంథకర్త యింతవఱకును ద్రొ క్కుచున్నతప్పుత్రోవ యొక్కటియే యాయన కెట్టి యపహాసాస్పద త్వము నేని సంఘటింపఁజాలెడిని. ఈవిషయమున గ్రంథకర్తకు మీరు చాలవిస్పష్టముగ బోధించి యున్నారు. ఇప్పుడు తనవాదము తప్పని యాయన యెఱుఁగును. ఎఱిఁగియు. "అథాత్తు" వాదమున కుపక్ర మించుట మూర్ఖలోకప్రతారణార్థ మని వేఱ చెప్ప నక్కఱ లేదు. అభి సారికాలక్షణము గ్రంథకర్త కన్వయించ లే దనుటకు నిన్న మొన్న నచ్చువడినట్టియు, సుమారు నూఱుసంవత్సరములకు మున్ను బహుగ్రం థద్రష్టయు వేదశాస్త్రపారావారఘటజన్ముండు నగు శ్రీమదాణివిళ్ళ వేంకటసోమయాజిగారిచే రచింపఁబడిన అప్పరాయ యశశ్చంద్రో దయమునుండి కొన్ని యక్కరము లుదాహరించి యింతతో విరమించు చున్నాఁడను. "శ్లో. కాన్తార్థినీతు యాయాతి సంకేతం స్వయమా కులా ! కాంత న్నయతివా తత్ర సైవ స్యా దభిసారికా" ఇందలి యుత్త

ర్థమువలన గ్రంథకర్తవాద "మధాత్తు" వాద మని విస్పష్ట మగుచున్నది. మఱియు గ్రంథకర్త మీపై తృణీకారభావముతో వ్రాసిన "కశ్చిత్కాంతే" త్యాద్యప్రగల్భోక్తు లాయనకే యపహాస్యత్వమును అనాత్మజ్ఞత్వమును, ఆపాదించునవి యని యెఱుఁగనివారు విజ్ఞులం దుండరు. ఇప్పటికేని గ్రంథకర్త తెలివి గలిగి తనతప్పిదము నొప్పుకొన్నచోఁ గొంతగౌరవాస్పదుఁడు కావచ్చునని తలఁచెదను. చిత్తగించవలెను.

22-10-1917. } చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శతావధాని,
కడియము, గోదావరి.

శ్రీమద్విద్వచ్ఛతావధానులు తిరుపతిశాస్త్రులుగారి యభిప్రాయము.—

నాయభిప్రాయముకూడ శ్రీవేంకటశాస్త్రిగారి యభిప్రాయముతో కలిపియె పంపుకొనుచున్నాను.

దివాకర్ల తిరుపతిశాస్త్రి.

శ్రీమత్కల్లూరు వేంకటరామశాస్త్రులవారియభిప్రాయము.—

రాజమండ్రి.

నెల్లాల సదాశివశాస్త్రులవారిచే విరచితం బైన యాంధ్రదశరూపకవిమర్శంబును శ్రీ బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారిచేత నాంధ్రీకృత మైనదశరూపకంబును బఠియించితి. ఇందు వివాదాస్పదం బగువిషయంబులు కొన్ని నెఱయుచుండెడి.

(1) "కామార్తాభిసరేత్కాంతం సారయేద్వాభిసారికా" అనెడి యీశ్లోకమున వివాదాంశమును బరికించితి. ఇట మధ్య మణి న్యాయంబున నుండిన కాంతపదార్థము పూర్వం బగు నభిసరణక్రియతోడం బలెఁ బరం బగునభిసారణక్రియతోడను గర్మకారకంబుగా సమన్వయించుం గాని యసందర్భరీతి గల దూతి మధ్యను నధ్యాహృతగా నేతెంచి యభిసారణక్రియతో సంబంధింప నేరదు. ఏల యనంగా.

"(యా) దూతీ మభిసారయేత్ (సా) అభిసారికా" అని వాక్యం బగుం గదా! "దూతీ మభిసారయేత్" అనఁగా, దూతీ మభిసారికాం కుర్యాత్, అనినవాక్యంబు పర్యవసన్నంబై "దూతిని నభిసారికను జేయునది యభిసారిక యనంబడు" నన్న లోకవిరుద్ధార్థము తోఁచెడి. అందున దూతి నాయకునితో మేళగించునట్లు స్ఫురించి "నిశ్శేష చ్యుత చందనమ్" ఇత్యాదిశ్లోకార్థంబునకు విషయం బయి రసాభాసార్థ మయ్యెడి. ఇంతియ కాక, నాయిక కామార్త కాఁగా దూతిక యభిసారిక యగు నన్న ఫలితార్థంబున నభిసరణకామార్తిరూపకార్యకారణంబులకు భిన్నాధికరణత్వమ్ము తోఁచి యనన్వయంబును సంభవించు. ఒకవేళ, నట్టి వాచ్యార్థానుపపత్తిం జేసి యభిసరణశబ్దమునకు నభిముఖముగాఁ బోవుట మాత్రమే యర్థము చెప్పాదు మంచు రేని యట్లననలను. అభిసరణశబ్దంబు రిరంసావంతులౌ స్త్రీపుంసులగమనమునందే యిట యోగరూఢంబు. దానంజేసి ప్రధానం బగు నాయికకుం గాని నాయకునికిం గాని యభిసరణంబు చెందవలయు. కనుకనే "కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా" అను ప్రతాపరుద్రీయమందలి యభిసారికాలక్షణంబును వివరించుతఱిని "కాంతస్య కర్మణః కర్తుర్వాభిసరణే ఉద్యుక్తా" అని రత్నాపణమందు నభిసరణము ప్రధానులైన స్త్రీపుంసులకే వివరింపఁబడినది. కాని దూత్యభిసరణాదులు చెప్పంబడ లేదు. అందున నధ్యాహారానన్వయా ద్యనేకదోషభూయిష్ఠం బగు దూత్యభిసరణంబు దూరీకృతంబై విమర్శకులు వచించినరీతిని శాస్త్రీయంబౌ ప్రియాభిసరణంబె పండితప్రియం బగుం గావుత!

(2) "ఎవనిదశవిధరూపంబు లెదఁ దలంచి। యనుకరించియు సరసులు హాయినుందురు" ఇట ననుకృతియు సుఖానుభూతియు రెండును సరసులకే చెప్పంబడియె. అనుకృతి నటనిష్ఠముగాని సామాజికనిష్ఠము గానేరదు. అట్టి యనుకర్తయగా నటునకు సుఖానుభూతి యున్న యనం దగు. కాపుననే "అనుకర్తు ర్నటస్యాప్యభినయసభా

రంజన ధనార్జనా ద్యభినివిష్టచేతస్కతయా రసానుభవాభావాత్ ”
అని సాహిత్యరత్నాకరరసతరంగమందు నటునికి రసానుభవంబు లేమి యుద్ఘోషింపఁబడుచుండు. సామాజికులు రసానుభూతికర్త లైనను, వారనుకర్తలు గారు. కాఁబట్టి పద్యోక్తధర్మంబులు సమానాధికరణంబులు గానేరవు.

ఇట్లె యాంధ్రగ్రంథంబునఁ దక్కినయంశంబులును సరిపడకయున్నవి. పచేళిమపాండితీప్రదర్శనం బయిన యీవిమర్శనకిశోరకోశం బందలి యుక్తిపుంజం బాలోచింపఁగా విమర్శకుల నిరంకుశకుశాగ్రధారామోషిమనీషావిశేషంబును విశదపఱచుచుండు. శాస్త్రానుసారంబునఁ బావనంబులై పూజ్యంబు లైన యందలి పట్టికోక్తులు వదనం బందలిరదనంబుల నట్టులు సేయుటకో యనునట్టులు రదనసంఖ్యతో (౩౨) మెలంగెడి. వే యేల? శితకోటియుతం బా ననఁగాఁ దీక్ష్ణమయినయంచులతోఁ గూడిన సుదర్శనంబు (చక్రము) దశరూపమూర్తి (విష్ణువు) యొక్క పరాక్రమంబును వెలువరించురీతిని నీవిమర్శనంబు శితకోటియుతం బై యనఁగా వాఁడియైన స్వపక్షసాధకయుక్తులు గలది యై సంస్కృతదశరూపగ్రంథముయొక్క పరాక్రమంబును (సామర్థ్యమును) లేక తెలుంగుదశరూపగ్రంథముయొక్క గొప్పయక్రమంబును, అథవా దశరూపగ్రంథసంబంధి పరకృతాక్రమంబును మిక్కిలి విశదీకరించెడి నని నాతాత్పర్యము.

శ్లో. శితకోటియుతం సుదర్శనం దశరూపస్య యథా పరాక్రమమ్। వివినక్తి తమాం విమర్శనం దశరూపస్య తథా పరాక్రమమ్.

కాన నీవిమర్శనంబు సుదర్శన మనఁబడుం గాత.

ఇట్లు
కల్లూరి వేంకటరామశాస్త్రి,
ప్రథమగీర్వాణపండితుఁడు,
గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ,

5-8-1917.
రాజమహేంద్రవరము.

శ్రీయుత వడ్డాది సుబ్బారాయఁడుగారి యభిప్రాయము.—

రాజమంద్రి.

ఆర్యా! తా మాదరముతో నంపిన యాంధ్రదశరూపక విమర్శగ్రంథమును, తత్ప్రేషణకారణము సువ్యక్తముసేయు నుత్తరమును, వందనపూర్వకముగా నందుకొని విమర్శగ్రంథము నామూలాగ్రము సావధానతం జదివితిని.

లోకోపకారక మయిన తమపాండిత్యప్రకర్షమును, మార్దవమునకు లోనయిన తమవిమర్శవిధానమును గడు శ్లాఘాపాత్రములు.

"కామార్తాభిసరేత్కాంతం సారయేద్వాభిసారికా" యను సంస్కృతలక్షణమును, "గీ. కామపీడిత యగుచుఁ దాఁ గాంతు కడకుఁ। జక్కఁగాఁ బోవునది యభిసారిక యగు" నని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తెలిఁగించుట తమవిమర్శప్రారంభమునకు మూలముగా గోచరించుచున్నది. విమర్శగ్రంథమందు వాదప్రతివాదములు రెండు నన్యోన్యైక్యవిషయముననే కానవచ్చు చున్నవి. సూర్యనారాయణశాస్త్రిగారి యాంధ్రపద్యమునందుఁ దాము చేసిన యాక్షేపము సరియయినదిగానే కాని శాస్త్రిగా రనినట్లు ప్రామాదికముగాఁ దోఁచుట లేదు. "అభిసరేత్, సారయే" త్తను నుభయక్రియలకు నడుమ నున్న "కాంత" మ్మను ద్వితీయాంతపదము కర్మమై యీ రెండుక్రియలతో నన్వయింపవలయు ననువాదము సరసముగా నున్నది.

"నచ మేవ గచ్ఛతి యథా లఘుతా" మిత్యాదిశ్లోకవిషయమున సూర్యనారాయణశాస్త్రిగారు "కాంతుని గూర్చి దూతిక నభిసరింపఁజేయునది యని యర్థము" అని వ్రాసినయంశము విశ్వాసనీయముగాఁ దోఁపదు. ఆశ్లోకము "సారయేద్వా" అను ద్వితీయలక్షణమునకు ననుకూలముగాఁ గాంతుని రప్పించుకొనువిధమును గూర్చి చూపినలక్ష్య మని స్పష్టపడు చున్నది.

"సారయే ద్వా" యనుమూలమున కర్థము తెలుఁగులక్షణ మునఁ గానరా దన్నందులకు "గ్రంథవిస్తరభయమున రెండవలక్షణ మును విడిచితి" నని సూర్యనారాయణశాస్త్రిగారు వ్రాసిన యుత్తరము ప్రశస్తముగాఁ జూపట్టదు. ఇతరగ్రంథభాషాంతరీకరణవిషయమున ఛందోనిర్బంధాదికారణములచే నేదేని యొకసాధారణాంశము విడిచిన నది యంతప్రమాదముగఁ దోఁపక పోవచ్చునేమో కాని లక్షణగ్రంథము భాషాంతరీకరించునప్పుడు మాత్రము కవి కట్టి స్వాతంత్ర్యము బొత్తిగఁ దగియుండ దని తలంచెదను. అందునఁ బ్రస్తుతాంశమే నిదర్శనము. చిత్తగింపవలయును.

29-7-1917.
రాజమహేంద్రవరము.

విధేయుఁడు,
వ. సుబ్బారాయఁడు.

శ్రీమ ద్విమలాపురవాస్తవ్య పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యభిప్రాయము.—

"ఆర్యాః భవద్భిః ప్రహితాని పుస్తకాని ప్రాప్తాని దర్శితానిచ అస్మ గ్గురుచరణేభ్యః. సూర్యనారాయణీయ నిసర్గసాహసేన పరం విస్మయమానానాం అస్మ ద్గురుచరణానా మనుమ త్యైవ కించి దద్య లిఖామి. పరంతు ప్రత్యుత్తరప్రేషణే భవద్భి స్సహ్యాః కాలవిలంబః.

11-2-17 దినే శ్రీమంతః మల్లాది సూర్యనారాయణశాస్త్రిణః మాం ప్రశ్నద్వయం పృచ్ఛన్తః అస్మ ద్గురువర్యాన్ శ్రీమతః మంథోపపదచన్నశాస్త్రిమిశ్రాన్ మరువాడవంశ్య శంభనశాస్త్రిపాదాం శ్చానుయుజ్య యుష్మ దాశయమా వేదయేతి యదలేఖిషుః తస్యాః పత్రికాయాః 16-2-17 దిన ఇత్థం ప్రత్యుత్తర మదామ్.

తథాహి. "ప్రమోదే పత్రికాం ప్రేక్ష్య ప్రహితాం భవతా సఖే। మదీయ మాశయం కించి దావిష్కుర్వే వ్యపాటవే॥ దుర్లభం దర్శనం శ్రీమ చ్చన్ననామకశాస్త్రిణామ్ । అభవ న్నావకాశో మే

భవా నుత్తరయే దితి॥ మర్వాడవంశమణయో గురవ శ్శంభుశాస్త్రి ణః। కథయామాసు రేతస్మిన్ ప్రవర్తే సాహసే ఒముతః" ఇతి.

తేషాం ద్వితీయప్రశ్నస్య మయా లిఖితేయం ప్రతిపత్రికా.—

ఆసన్నపదపరిహారేణ స్వాధీనపతికా భవితు మర్హతి వాసక సజ్జికేతి, దశరూపకస్థాత్ "ఆసన్నాయత్తరమణా" ఇతి సూత్రా దుపరితనేన• "నచ వాసకసజ్జాదేః స్వాధీనపతికాదా వంతర్భావః, అనాసన్నప్రియత్వా ద్వాసకసజ్జాయాః న స్వాధీనపతికాత్వమ్" ఇతి గ్రంథసందర్భేణ ఆసన్నపదతాం భేదయతా భాభాతి. ఇతి.

యత్తు "ప్రథమః ప్రశ్న స్త్వ విసంవాదీ" ఇతిచ. త దేతత్ ప్రథమప్రశ్న స్యానుమోదనం ప్రతిలిఖా మిదానీమ్. మల్లాది సూర్య నారాయణశాస్త్రిణః స్వలిఖితపత్రికాయాం పప్రచ్ఛుః మా మేవమ్. "త ద్దర్శన మిత్యస్య అనుకార్య రామదర్శన మిత్యర్థః స్యా ద్వా? నవా? చే త్తథా సోనుకార్యరామః రంగస్థ రామవేషధారీ నట ఇతి వక్తు మర్హతివా? నవా? ఇ త్యేవ మనుయుక్తం తదీయకూటప్రశ్న మవిమృశ్యైవ తదా అవిసంవాదీ త్య లేఖిషమ్. సూ. శాస్త్రిణస్తు మ త్పత్రికాస్థం "అవిసంవాద్యయ" మి త్యంశమాత్రం సంగృహ్య మదనుమోదనం ప్రథయామాసు రితి మన్యే.

ఇద మిదానీ' మావేద్యతే.

శ్రీసూర్య-శాస్త్రిరచి తాంధ్రదశరూపకే.

(౧) అనుకార్యరామస్య అనుకర్తృ నటపరతయా లేఖన మతి సాహసమ్.

(౨) త ద్దర్శన ఇత్యత్ర శృంగారదర్శన ఇతి సూ-శాస్త్రిణా మపి' నన్విష్టమ్.

తథాపి ఆంతరధర్మస్య వ్యాచాక్షుషస్య శృంగారాదిరసస్య ప్రతీయమానతాయాం నకోపి పవదేతి, ఏ తాదృశస్థలే సూ-శాస్త్రి ణాం వదతో వ్యాఘాతస్స్యా దేవ.

(౩) అవర్తమానస్యాపి వర్తమానవ దవభాసన మిష్యత ఏ వేత్యత్ర తచ్ఛబ్ద బలాదపి దాశరథి రేవ రసాలంబనం సహి నట ఇత్యేవ ప్రతీయతే.

(౪) సత్పురుషాణాంచ లజ్జేత రేషాం త్వసూయాదయః ఇత్యత్ర అంధ్రే ఇతరపదపరిహారః నాస్త్యేతి ధనికవ్యాఖ్యాభిప్రాయమ్.

ఏవ మాదిషు ప్రమాదపతి తేషు మహామహోపాధ్యాయ బిరుదాంకిత శ్రీమ ల్లక్ష్మణసూర్యాది పండితప్రకాండైః శ్రీమ ద్గోవింద నృసింహా శేమశాయ్యార్య మిశ్రైః సంస్కృతకలాశాలాధ్యాపకైః, యం-ఏ. బిరుదవిరాజమాన మాననీయ శ్రీకుప్పుస్వామిశాస్త్రిభిః శ్రీమద్భిః శ్వేతారణ్యనారాయణశాస్త్రిప్రముఖై శ్చ లిఖిత మభిప్రాయ మనుసర న్నేతావతా విరమామి, నైరంకుశ్యం కవీనాం సర్వాం సమ గ్రా హ్యామీాభి రితి మన్వానః.

| | |
|---|---|
| పింగళసంవత్సరఆశ్వయుజ కృ 3 భృగువాసరః. అమలాపురమ్. | ఇతి ఆవేదయితా విద్వత్కరుణాభాజనమ్. పేరి సుబ్రహ్మణ్యశాస్త్రి. సంస్కృతాధ్యాపకః, బి-హెచ్-స్కూల్. |

అమలాపురవాస్తవ్యులు శ్రీమదివటూరి సుందరయ్యగారు వ్రాసినది.

"తమరు నాకుఁ గృపతో నసిపిన దశరూపకవిమర్శనాదిగ్రంథము లందినవి. మల్లాదివారిఖండన మీప్రాంతములకు వచ్చి చూచి పోవుటకు దానికి మొగము చెల్లదు. ఇచ్చటి విద్వద్బృందము తన్ను మెచ్చుకొన్న ట్లాదూరదేశములవారికిం జెప్పి పగటివేషగానివలె నచ్చటనే తిరుగుచున్నది. శ్రీపేరి సుబ్రహ్మణ్యశాస్త్రులు మరువాడ శంభన్న శాస్త్రులుగార్లు మోమోటముచేత నైన దానినటనమును మెచ్చినట్లు సూచించి యుండ లేదు. వారు తమజాబును విమర్శమును జూచి వాని శావిన్యస్తకరాంగుళులై చింతించిరి. మల్లాదివారిఖండనము నొకదానిని

సంగ్రహించి మాకుఁ బంపఁ బ్రార్థించుచున్నాను. శాస్త్రిలుగారును దానిని గోరుచున్నారు. దానిని దిలకించినవెంటనె మల్లాదివారిపై నభియోగము దెచ్చుటకు సిద్ధముగ నున్నారు. శ్రీశాస్త్రిలుగార్లు తమకు విన్నపము ముందు పంపికొందురు. తమ రాఖండనమును బంపినతోడనే తమకు వారును నేనును శ్రీ బండారు తమ్మయ్యగారును నేకగ్రీవముగ మాయభిప్రాయములఁ బంపికొనుచున్నాము. మల్లాదివారి యుత్తరరామచరితముపైఁ గొందఱు (బండారువారు మొదలగువారు) విమర్శమును గొన్ని దినములలోఁ బ్రకటింపనై యున్నారు" అని.

కోవూరు శ్రీ వీరఘుంట సత్యనారాయణశాస్త్రిగారి యభిప్రాయము.—

"అన్య ద్భావాశ్రయ న్నృత్యమ్" అను దశరూపకమూల వాక్యమునకు "రసాశ్రయా న్నాట్యా ద్భావాశ్రయ న్నృత్య మన్య దేవ, తత్ర భావాశ్రయ మితి విషయభేదాత్ నృత్య మితి చ నృతే ర్గాత్రవిక్షేపార్థకత్వే నాంగికబాహుల్యాత్ తత్కారిషు నర్తక వ్యపదేశాత్" ఇత్యాది ధనికటీకావాక్యములు. ఇందలి "నృత్య మితిచ... నర్తకవ్యపదేశాత్" అను హేతువాక్యములకు రెంటికిని "గాత్రవిక్షేపమే ప్రయోజనముగాఁ గల నృత్యము చేయువాఁడు నర్తకుఁ డని చెప్పఁబడుటచేతను" అని సూర్యనారాయణశాస్త్రిలవారియాంధ్రీకరణము. ఇది సరిగా నుండ లేదు. నృత్యమునకు భావప్రకాశనద్వారా సామాజికమనోరంజనమే ప్రయోజనము గాని గాత్రవిక్షేపము ప్రయోజనము గాఁజాలదు. ఇదియును గాక "నృతేః గాత్రవిక్షేపార్థకత్వేన" అనువాక్యము "నృతీ గాత్రవిక్షేపే" అనుధాతువు నర్థప్రకాశకము గాని నృత్యము గాత్రవిక్షేపఫలక మని చెప్పెడువాక్యము గాదు. ఇచట నర్తశబ్దము ప్రయోజనపరముగా సమన్వయించి పైవిధముగా నాంధ్రీకరించుట సరి యైనది గాదు. ఈలాగుననే విమర్శనమందు వ్రాయఁబడిన యితరదోషములు గూడ దురుద్ధరములుగాఁ జూపట్టు

చున్నవి. శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు వ్రాసినఖండనగ్రంథమందు సమాధానము లేవియుఁ గాన్పించవు. స్థాలీపులాకన్యాయమును స్మరించి క్షమింప వేఁడెదను.

ఇట్లు

3-9-1917. కోపూరు. } ఆంధ్రగీర్వాణవిద్యాలయసంస్కృతోపాధ్యాయుఁడు, వీరంఘంట సత్యనారాయణశాస్త్రి.

నిడదవోలు శ్రీ పురిఘళ్ళ రామశాస్త్రులవారి యభిప్రాయము.—

మహారాజరాజశ్రీ శ్రీను తొ్కల్లాపురప్రభువర్యులసముఖము నకు, నిడదవోలుగ్రామకాపురస్థుఁడు పురిఘళ్ళ రామశాస్త్రి వ్రాసికొన్న విజ్ఞాపనము.—

తమ ఆశ్రితులు వెల్లాల సదాశివశాస్త్రిగారు, 3-9-17 తేదిని యీగ్రామమునకు దయచేసినారు. శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు రచించిన ఆంధ్రదశరూపకమున్ను దానిపై సదాశివశాస్త్రులుగారు విమర్శించినయంశములును నాకు వినిపించిరి. వారివిమర్శములో వ్రాయఁబడిన 32 ఆక్షేపణలున్ను సప్రమాణముగాను దుర్ధరములుగాను నున్నవి. సూర్యనారాయణశాస్త్రులుగారు దశరూపకములోని "అన్య ద్భావాశ్రయ న్నృత్యమ్" అనువాక్యముక్రింద నున్న "నృత్య మితిచ నృతే ర్గాత్రవిక్షేపార్థక త్వే నాంగికబాహుల్యా త్తత్కారిషుచ నర్తక వ్యపదేశాత్" అను హేతువాక్యద్వయమ్మును పుచ్చుకొని "గాత్రవిక్షేపమే ప్రయోజనముగా గల నృత్యము చేయువాఁడు నర్తకుఁ డని చెప్పఁబడుటచేతను" అని ఆంధ్రీకరించిరి. ఇందు "నృతీ గాత్రవిక్షేపే" అనుసూత్రముచే నృతధాతువునకు గాత్రవిక్షేపార్థ మసి తదర్థ మయి యుండఁగా అర్థశబ్దమునకు ప్రయోజనార్థము చేసి "ఆంగికబాహుల్యాత్" అనేవాక్యమును వదలి విపరీతార్థ

ఘును చెప్పుటవలన వా రీదశరూపకగ్రంథమును సావధానచిత్తులై చూచి తెనిగించినట్టు నాకు తోఁచలేదు. తక్కినయాక్షేపము లన్నియు నీరీతిగానె యున్నవి.

చిత్తగింపవలయును.

పురిఘుప్ప రామశాస్త్రి.

నిడదవోలు శ్రీమ దాచంట సూర్యనారాయణరాజుగారి యభిప్రాయము.—

పండితవర్యా! మల్లాది సూర్యనారాయణశాస్త్రిలుగారు తెలుగుశాసంబునకి మార్చిన దశరూపకము, ఉత్తరరామచరిత్రము చూచియుంటిని. ఉత్తరరామచరిత్రమునందలి కొన్ని పద్యములు భవభూతికిఁగల కవిభావము గాని సదభిప్రాయము గాని ప్రకటింపకపోవుట యటుండ, కొన్నిటియందలి భావము, మాతృకకుఁగూడ భంగము తెచ్చినట్లుండెను. ఉత్తరరామచరిత్రములోఁ దక్కువి తీసికొనిన తీసికొనఁదగినస్వాతంత్ర్యము, లక్షణగ్రంథ మగు దశరూపకమునఁ గైకొనుట యసంగతము. పైగ లోకమునకు హాని. కావునసే తద్దశరూపకభాషాంతరీకరణము బహుపండితులవిమర్శకుఁ బాత్ర మగుటచే లోకము చూచుటకు భయపడుస్థితికి వచ్చినది. లేక వచ్చుటకుఁ దగినస్థితియం దున్నది.

చిత్తగించవలెను.

3-9-1917.
నిడదవోలు.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,
ఆచంట సూర్యనారాయణరాజు.

నిడదవోలు శ్రీయుత వేంకటపార్వతీశ్వరకవివరుల యభిప్రాయము.

మహారాజరాజశ్రీ శ్రీరాజా సురభి వేంకటలక్ష్మారావు, బహాదుర్ గారి దివ్యసముఖమునకు, వేంకటపార్వతీశ్వరకవులు వినయపురస్సరముగ వ్రాసికొన్న విజ్ఞాపనము.—

విద్వత్ప్రభుశిరోమణీ! పలినవారియాస్థానవిద్వాంసు లగు బ్రహ్మశ్రీ వెల్లాలసదాశివశాస్త్రులవారు 3 వ తేదిని నిడదవోలులో మాకు దర్శన మొసంగి యున్నారు. అపుడు ప్రస్తావవశమున "ఆంధ్రదశరూపకముపైఁ దాము చేసినయాక్షేపములను గూర్చి మాకు విశదముగాఁ దెలిపి యున్నారు. అందుపై మాయభిప్రాయము నీక్రిందఁ బొందుపఱచి యున్నారము.

గీర్వాణభాషనుండి కావ్యములను గాని, పురాణములను గాని యాంధ్రీకరించుపట్టున నాంధ్రకవి మూలాభిప్రాయమునకు భేదము గలుగకుండఁ బ్రస్తుతభాషానుకూలముగఁ గొన్నిమార్పులను చేసినను లోకమున కవి యంత బాధకములు గాఁజాలవు. కాని శాసనములవలెనుండుశాస్త్రముల నాంధ్రీకరించునప్పుడు మాత్ర మాంధ్రకవి యట్టి స్వేచ్ఛావృత్తినే యవలంబించినచో మూలకారునియభిప్రాయమునకు భంగమును శాస్త్రమునకు వైయర్థ్యమును సిద్ధించుటచే నట్టి యాంధ్రీకరణము నిష్ప్రయోజన మగుచున్నది. కాఁబట్టి శాస్త్రములను భాషాంతరమునఁ గూడ యథారూపముననే ప్రదర్శించుట కట్టి యాంధ్రకవి యప్రమత్తుఁడై చూచుకొను చుండవలెను. మానవస్వభావమును బట్టి యెంతపండితుల కైనను బ్రమాదము గలుగుచుండును. అంతమాత్రమున వారిప్రతిభకు లోపము కలుగదు. కాని యెంతటిపండితుని ప్రమాద మైనను బ్రమాదమే యగును గాని యది లోకమునకు బ్రమోదదాయకము కాఁజాలదు. శాస్త్రోద్దేశమున కనర్థదాయకంబు లగునట్టిప్రమాదములను గూర్చి విజ్ఞులు ప్రబోధించినప్పుడు వానిని సవరించుకొనుట కవి తన కపకీర్తికరం బని భావించుకొనఁ గూడదు. కవికి దనకావ్యమును నిష్కళంకముగాఁ జేసికొనుట విధాయకకృత్యమే కదా. లోకోపకారముకొఱ కొకశాస్త్రము నాంధ్రీకరించునపుడు దానిని నిర్దుష్టముగఁ జేసికొనుట కవి కెంతటిధర్మమో యందలిప్రమాదములను గూర్చి కవిని బ్రబోధించుట పండితులకుఁ గూడ నంతధర్మమే

యగును. ఈవిషయమున నిరుపురియుద్దేశములును లోకోపకారము కొఱకే యగుచున్నవి. కావునఁ గవి గాని విమర్శకుఁడు గాని యందుల కనిష్టమును సూచించుట ధర్మము కాదు.

బ్ర-శ్రీ, మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారిచే నాంధ్రీకరింపఁబడిన దశరూపకముపై బ్ర-శ్రీ, వెల్లాల సదాశివశాస్త్రిలవారొనరించినయాక్షేపములను గొన్నింటిని జూచి యున్నారము. అవి మిగుల సమీచీనములుగనే యున్నవి గాని కేవలవివాదసూచకములుగ లేవు.

(1) "దశరూపానుకారేణ యస్య మాద్యంతి భావకాః" అనుశ్లోకమున కాంధ్రమున రచియించినపద్యము యథోచితముగా లేదు.

(5) "సత్పురుషాణాం చ లజ్జేతరేషాం త్వసూయానురాగాపహారేచ్ఛాదయః ప్రసజ్యేరన్" అనుదాని కాంధ్రమున "పైఁగా సత్పురుషు లగువారికి లజ్జాసూయాదులు కూడ జనించును" అని వ్రాయుట మూలానుసారముగ లేకుండుటయే కాక విపరీతార్థమును గూడఁ గల్పించుచున్నది.

బ్ర-శ్రీ, సూర్యనారాయణశాస్త్రిలవారు తాము చేయునది శాస్త్రాంధ్రీకరణము గావునను, దానియందుఁ దమ కెట్టిస్వాతంత్ర్యమును లేదు కావునను సహేతుకములుగ నున్న యిట్టివిషయములను సవరించుకొన్నచో నిరాబాధముగ నుండు నని మే మభిప్రాయపడుచున్నారము.

దివ్యచిత్తమునకుఁ దేవలయును.

4-9-1917.
నిడదవోలు.

వేంకటపార్వతీశ్వరకవులు.

ఏలూరునగరవాస్తవ్యు లగు శ్రీకలువలపల్లి రంగనాథశాస్త్రిగారి యభిప్రాయము.—

అయ్యా! మీరు రచియించిన యాంధ్రదశరూపకవిమర్శన గ్రంథమును గౌతూహలంబుతో సమాహితచిత్తుండనై తుదిదాఁకఁ జదివి పరికించితిని. అందు సప్రమాణంబులుగఁ గనఁబఱచినయాక్షేపంబులు సమంజసము లనియు న్యాయ్యము లనియును ఆంధ్రదశరూపకకర్త లగు శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిసమాధానము లసంగతము లనియును తగినసామగ్రి లేక సంస్కృతగ్రంథములను దెలుగింపఁబూనుట సాహస మనియును సహృదయు లగువిబుధులు వక్కాణింతు రని నాయభిప్రాయము. అదియునుం గాక సంస్కృత జ్ఞానము లేనివారి తెనుంగుం జదివికొని నాటకాదిరచనఁ గావించిన నెట్లుండునో ప్రాజ్ఞులే యెఱుంగుదురు. అంతర్వాణులును విమర్శకాగ్రగణ్యు లగు మీరు సర్వధా శ్లాఘనీయులు.

4-9-1917.
ఏలూరు, కృష్ణాజిల్లా.

ఇట్లు విధేయుఁడు,
కలువలపల్లి రంగనాథశాస్త్రి.

కెర్నిపాడు శ్రీజంద్యాల శివన్న శాస్త్రిగారి యభిప్రాయము.—

తాము దయతో నంపిన యాంధ్రదశరూపకవిమర్శ మను గ్రంథము నుత్తరమును జేరినవి. పదిదినములనుండి జ్వరబాధచే నాదేహ మస్వస్థముగా నుండినను విమర్శనములు న్యాయ్యములుగను హృదయంగమములుగను గన్పట్టుటచే గ్రంథ మామూలాగ్రముగఁ జూచి మిగుల నానందించితిని. అభిసారికాద్వితీయలక్షణముఁ గూర్చి తాము వ్రాసిన విమర్శన మెంతయు సమీచీనము. ఆర్యాసప్తశతిలో "అకలితశబ్దాలంకృతి" యనుశ్లోకములో "అభిసారికేవ" యనుస్థలమున అనంతపండితుఁడు వ్రాసిన "అభిసారికేవ అభిసరణాభిసారిణ్యాన్యతరవతీవ, ఉక్తంచ యా చార్థాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా, ఇతి"

అతఁడు వ్రాతమూడ "ప్రియు నభిసరింపఁజేయునదికూడ నభిసారిక" యను తమలేఖనమున కనుకూలముగనే కన్పట్టుచున్నది. "దశ ద్వైవరసాశ్రయ" మనుచోటఁ దాము గనఁబరచిన హేతువులు విశ్వసనీయములు. "ఛన్నకామసుఖార్థాజ్ఞ" యనుస్థలమున నాంధ్రీకరణము తత్కర్తల గీర్వాణభాషానభిజ్ఞతను సూచించుచున్నది. విమర్శోక్తి హృదయంగమము. "శ్లిష్టో వికారో మాధుర్యమ్" అనుస్థలమున మాధుర్యగాంభీర్యములకు లక్షణసాంకర్యము జేయుట ఆంధ్రీకర్తలపొరపాటు. "వక్ష్యమాణానాం చ" యనుచోట నాంధ్రీకరణము ధనికాభిప్రాయవిరుద్ధ మనుట నిర్వివాదము. మిగిలినవిమర్శనములును సహేతుకముగను న్యాయ్యముగను జిజ్ఞాసువుల కుపకారకముగను నుండినవి. కార్యాంతరవ్యగ్రతచేత మీకు వెంటనే జబాబియ్యనందులకు క్షమింపవేడెద. చిత్తగింపుఁడు.

విధేయుఁడు,

జంద్యాల శివన్న శాస్త్రి.
గొర్నిపాడగ్రహారము, గుడివాడ పోష్టు,
కృష్ణాజిల్లా.

జ్యేష్ఠబ౧౩
భానువారము.

శ్రీమచ్చింతలపాటి రామమూర్తిశాస్త్రులవారి యభిప్రాయము.—

శ్రీమజ్జటప్రోలుసంస్థానాధీశ్వరులును విద్యావినోదరసికులు నగు శ్రీ శ్రీరాజా వేంకటలక్ష్మారావు బహాదుర్ నిజాం నవాజువంతు గార్లకు.

కృష్ణాజిల్లా గుడివాడవాస్తవ్యుఁడు చింతలపాటి రామమూర్తి శాస్త్రి ఆశీఃపూర్వకముగ వ్రాసికొనినవిజ్ఞాపనము.—

అయ్యా! బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రులవారి యాంధ్రదశరూపకవిమర్శనము నంతయు నెంతయుం బరిశీలించితి. వారు వ్రాసినయాక్షేపము లన్నియు మూలగ్రంథమును దద్వ్యాఖ్యను ననుస

రించి యుండుటచే సమంజసముగా నున్న వనుట కెంతయు సందియము లేదు.

"కామా ర్త్యాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" యను దానికి, కామార్తయై ప్రియు నభిసరించునదియుఁ బ్రియుని దనకడ కభిసరింపఁ జేయునదియు ననియే యర్థము. గ్రంథము లన్నియు నీతీరుగనే ఘోషింపుచున్నవి.

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారి కైనను నీ యర్థమే స్ఫురించి యుండును గాని "నచ మేవ గచ్ఛతి" యను వ్యాఖ్యానశ్లోకము భ్రమ గల్గఁ జేసినది. కనుకనే సందేహముచే రెండవ లక్షణము దెనుగింప రైరి.

సదాశివశాస్త్రిలవారు "ప్రియు నభిసరింపఁజేయునది కూడ నభిసారిక యను రెండవలక్షణ మేల యాంధ్రీకరింపఁబడ లేదు" అని సూర్యనారాయణశాస్త్రిలవారికి వ్రాయఁగా నప్పు డా భ్రమను బోఁగొట్టుకొనిరో లేదో, "దూతిక నభిసరింపఁజేయునది యనియే యర్థము, ధనికునియభిప్రాయమును నిదియే" అని యేవియో కొన్ని సంగతులను వ్రాసినారు.

తర్వాత సదాశివశాస్త్రిలవారు "ధనికుని ద్వితీయోదాహరణము దూతీద్వారమున ప్రియానయనపర మని వ్రాసినయుత్తరమును జూచి యైనను భ్రమను నివర్తించుకొని యుందురు కాని యేదో త్రోవ ద్రొక్కితిమి కదా! కానిమ్ము దానిఁ దొల్గనేల యను పట్టుదలతో మంటిము క్కయినను నాముక్కే గెలువవలయు నని పెనుగులాడుచున్న ట్లూహించెదను.

ఇంతియ కాని "సారయే ద్వాభిసారికా" యనుదానికి "దూతి నభిసరింపఁజేయునదియు నభిసారికయే" యని శాస్త్రానుభవము గల పండితు లెవ్వరుం జెప్పరు.

**సీ.** సిరియురంబునఁ గలవాఁడు మెరుగుహొన్ను । విలువవలె వాటువాఁడు మే ల్లులఁచువాఁడు । మరునిఁ గన్నాఁడు గరుటాలమంతు నెక్కు । ప్రోడ జట్టుప్రోలురాయ నిన్ బ్రోచుఁ గాత.

6-7-1917. }
గుడివాడ. }　　చింతలపాటి రామమూర్తిశాస్త్రి.

ఈ రామమూర్తిశాస్త్రులవారు నాపేర వ్రాసియంపిన యభిప్రాయము.—

తమరు వ్రాసినవిమర్శన మంతయుం బరిశీలించి నాయభిప్రాయము శ్రీ శ్రీ వేంకటలక్ష్మారావుగారి కుత్తరద్వారా తెలియపరచితిని.

"కామార్తాభిసరేత్కాంతం సారయేద్వాభిసారికా" అనుదానికి, కామార్తయై దూతి నభిసరింపఁజేయునది యభిసారిక యనునర్థము నిదివరకు కనియు వినియు నుండలేదు. ఈయర్థము నేపాటిసాహితి గలవాఁడునుం జెప్పఁడు. తక్కిన యాక్షేపము లన్నియు సమంజసములుగానె యున్నవి. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారిది పొరపా టని చెప్పక తప్పదు.

28-7-1917.　　చింతలపాటి రామమూర్తిశాస్త్రి.

విద్వచ్ఛతావధాను లగు శ్రీదూపాటి వేంకటరమణాచార్యులవారి యభిప్రాయము.—

గంపలగూడెము, కృష్ణాడిస్ట్రిక్టు. 17-6-1917.

శ్రీ మహారాజరాజ శ్రీరాజా సురభి వేంకటలక్ష్మారావు బహద్దరు నిజాం నవాజువంతువారిసముఖమునకు.

విధేయుఁడు దూపాటి తిరుమలవేంకటరమణాచార్యులు శతావధాని వ్రాయు విజ్ఞాపనము.—

తమ సంస్థానపండితు లగు బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రిలు వారిచే రచియింపఁబడిన ఆంధ్రదశరూపకవిమర్శము సాంగముగఁ జదివితిని. శ్రీసదాశివశాస్త్రిలవారి ముప్పదిరెండుసందేహములు దోషములే యని మూలగ్రంథము చూచి గ్రహించితిని. విమర్శము చక్కఁగ వ్రాయఁబడినది.

"సారయే ద్వాభిసారికా" అను దశరూపకోక్తికి శ్రీసదాశివశాస్త్రిలవారి "ప్రియుని నభిసరింపఁజేయునది యభిసారిక యను తెలిగింపు యుక్తముగ నున్నది. సదాశివశాస్త్రిలవారి తెలిగింపు ప్రమాదమని బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు "కాంతునిఁగూర్చి దూతిక నభిసరింపఁజేయునది యభిసారిక" యనుట మూలమునకు వ్యాఖ్యానమునకు విరుద్ధము. కాంతపద ముభయమునకు వర్తించును. ఇది సుధీజనసమ్మతమే. ఈవిషయమయి అమరుకావ్యములోని దృష్టాంతము, రసార్ణవసుధాకరములోని దృష్టాంతము ప్రమాణముగ గణింపఁదగి యున్నవి. ఈవిషయములో సూర్యనారాయణశాస్త్రిగారు పొరపడిరి.

(2) "సత్పురుషాణాం చ లజ్జేతరేషాం త్వసూయానురాగాపహారేచ్ఛాదయః ప్రసజ్యేరన్" అను ధనికునివ్యాఖ్యానమునకు. "సత్పురుషు లగువారికి లజ్జాసూయాదులు గూడ జనించును" అను సూర్యనారాయణశాస్త్రిలవారియాంధ్రీకరణము మూలవిరుద్ధముగ నున్నది. "ఇతరేషాంతు అసూయానురాగాపహారేచ్ఛాదయః" అనుటలో "నితరులకు అసూయ అనురాగాపహారేచ్ఛ" మొదలగునవి కలుగు ననియు, పూర్వార్థముచే సత్పురుషులకు లజ్జ కలుగు ననియు, వ్యాఖ్యాత తేటతెల్లముగఁ జెప్పుచుండ "ఇతరేషామ్" అనునది విడిచి యావదర్థము సత్పురుషుల కంటఁ గట్టుటచే భావము చెడుచున్నది. సత్పురుషులు లజ్జ నొందుదురు కాని ఇతరులవలె అసూయాదు లొందరు. ఇట మూలము సూ-నా-శాస్త్రిలవారు చూచి తెలిగించియుండరు.

(3) "కుతోఽపి సంకేతస్థాన మప్రాప్తే నాయకే విప్రలబ్ధే" వ్యా॥ అనువ్యాఖ్యానోక్తిని సూర్యనారాయణశాస్త్రులువారు "ఏ కారణముచే నయిన సంకేతస్థానము చేరక పోయిరేని విప్రలబ్ధ లగుదురు" అని తెలిగించుట సరిపడదు. "అప్రాప్తే నాయకే" యనుటను ప్రథమాద్వివచనము చేసికొని శ్రీశాస్త్రులవారు పొరపడిరి. విప్రలబ్ధ లన్న వంచితలు అని యర్థము కదా! ఏకారణముచే నేని సంకేతముఁ జేరనితరుణులు విప్రలబ్ధ లెట్లగుదురు. ఇప్పట్ల సదాశివ శాస్త్రిగారివిమర్శము యుక్తియుక్తముగ నున్నది.

(4) "ధన్య కామసుఖార్థాజ్ఞ స్వాతంత్ర్యాహంయు షండకాః" అనుశ్లోకమును తెలిఁగించుటలో శ్రీసూర్యనారాయణశాస్త్రిగారె క్కడు పొరపాటు పడిరి. ఇప్పట్ల శ్రీవారు మూలము చూచి యను టకుఁ జూడలే దనుటకు వీలు లేదు. "సుఖార్థాః" అనుటకు అనాయాసముగ ధనము సంపాదించినయజ్ఞాను లనియు, "స్వాతంత్ర్యాహంయుషండకాః" అనుటకు మూర్ఖులు దుస్సహావాసులు నగు స్వాతంత్రులు అనియు, శాస్త్రిగారు వ్రాయుట కడు నసహ్యాకరముగ నున్నది. ఈశ్లోకములో విమర్శములో నుదాహరింపఁబడనిలోపములు పెక్కులు కలవు. విస్తరభీతిచే త్యజించి యుందురు.

(5) "శ్లక్ష్ణో వికారో మాధుర్యమ్" అనుటకు, నిర్వికారత్వము మాధుర్యము అనుట విరుద్ధము. మృదు వగు (ప్రియ మగు) వికారము మాధుర్యము అని యర్థము. ఇప్పట్ల లక్ష్యము నటులనే యున్నది. ఆంధ్రీకరణమున నాలక్ష్యము వీడి ఉత్తరరామచరితములోని "గేహాస్త దక్షిణా" అనుశ్లోక మిచటఁ దెలిగించుట యుక్తియుక్తము గాదు. "శ్లక్ష్ణః ప్రియం వదే" అని యమరసింహుఁడు. "శక్నోతి ప్రియ మేవ వక్తు మితి శ్లక్ష్ణః" అని వ్యుత్పత్తి చూచిన శ్రీవా రిటుల వ్రాయరు.

ఇచట సదాశివశాస్త్రులవారు వ్రాసినటుల లక్ష్యలక్షణములు రెండును సరిపడి లేవు. "జటాజూటగ్రంథిమ్" యనుట మృదు

వికారోద్బోధకమే. అవి వీనుల కొప్పులోపము. వేయేల? ఆంధ్రదశ రూపకమున శ్రీశాస్త్రులవారు వ్రాసిన వన్నియు, అనివార్యదోషములే. శ్రీసదాశివశాస్త్రిగారి విమర్శము సమీచీనముగ నున్నది. విస్తరించి వ్రాయ నవకాశము లేమిచే సూత్రప్రాయముగ విమర్శమును ప్రశంసింపఁగలిగితిని. తాము దయతో నుభయవిమర్శములు, పండితుల యభిప్రాయములు, మధ్యవర్తులతీర్మానములు, పీఠికగాఁ జేర్పించి దశరూపకము క్రమ్మఱఁ దెలింగింపు నొనరింపఁజేసి భాషాసతిని గౌరవింపఁ ప్రార్థితులు.

దూ-తి. వేంకటరమణాచార్యులు.

శతావధాని.

బెజవాడ బ్రహ్మశ్రీ వే- జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారి యభిప్రాయము.—

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారి ఆంధ్రదశరూపకముమీఁద బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రులవారు వ్రాసిన విమర్శనములో నెత్తిన ఆక్షేపములను సంస్కృతదశరూపకమును పెట్టుకొని ప్రతిస్థలమును ఎత్తి చూచితిని. విమర్శకులు చేసినఆక్షేపములు ఉన్నవే! కాని లేనివి కావు. ఆంధ్రీకర్తకు మూలగ్రంథము సరిగా అన్వయించనిదోషమో లేక మూలమును ఆలంకారికసమయములను త్రోసివేసి క్రొత్తగా తమకు తోచినట్లు వారు చెప్పబూనిరో? ఎట్లున వారిగ్రంథ మధిక్షేపార్హ మైనది. బహుస్థలములయందు వారు మూలగ్రంథమునకు విరుద్ధముగా చెప్పిరి. వానిని విమర్శకులు చూపించిరి. విమర్శకులు చేసిన ఆక్షేపణలలో మూడునాల్గు స్వల్పాక్షేపణ లనినను తక్కినవి నిరుత్తరములు. కాఁబట్టి సూర్యనారాయణశాస్త్రులవారి "ఆంధ్రదశరూపము" ఆపేరు గల సంస్కృతగ్రంథమునకు

సరియైన ఆంధ్రీకరణ మని గాని ఆగ్రంథములో చెప్పినవిషయములను చెప్పినట్లు సరిగా ప్రతిపాదించిన దని కాని ఆదరించతగి లేదు అని.

5-9-1917. బెజవాడ. } జంధ్యాల గౌరీనాథశాస్త్రి.

బెజవాడ బ్రహ్మశ్రీ వేదమూర్తు లగు మల్లాది రామకృష్ణవిద్వత్సోమ యాజులవారి యభిప్రాయము.—

తాము పంపిన పుస్తకము, ఉత్తరముగూడ చేరినవి. ఆంధ్ర దశరూపకవిమర్శనము నంతయుఁ జదివితిని. ఆగ్రంథమున తాము గనుపరచినయాక్షేపము లన్నియు సుసంగతములుగా నున్నవి. ఇదియే నాయభిప్రాయము అని.

21-9-1917. బెజవాడ, గవర్నరుపేట. } మల్లాది రామకృష్ణవిద్వత్సోమయాజీ.

బ్రహ్మశ్రీ అష్టావధాను లగు శ్రీమజ్జానపాటి పట్టాభిరామశాస్త్రిలవారి యభిప్రాయము.—

అభినవసరస్వతి యను మాసపత్రికయందు ముద్రింపఁబడినది.

ఆంధ్రదశరూపకవిమర్శనము." ఈవిమర్శనకారులు కొల్లాపుర సంస్థానపండితు లగు వెల్లాల సదాశివశాస్త్రిలవారు. విమృష్ట మైన యాంధ్రదశరూపకము రచించినవారు సంస్కృతకవిజీవితాదిగ్రంథకర్త లగు మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారు. ఇందు ౩౨ ఆక్షేప ములు కావింపఁబడినవి. అందు ౨ మాత్ర మిచటఁ గనఁబఱచెదము.

(1) సంస్కృతదశరూపకము. "కామార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" దీనికి సూర్యనారాయణశాస్త్రిగారి యాంధ్రీ కరణము. "తే. కామపీడిత యగుచుఁ దాఁ గాంతునెడకుఁ। జక్కఁగాఁ బోవునది యభిసారిక యగు" అని. ఇందుఁ బ్రథమపాదార్థము దప్ప

ద్వితీయపాదార్థము పద్యశేషమం దైనను గాన్పించదు. ఆయంశమునం గూర్చి యుభయపండితులకు నుత్తరప్రత్యుత్తరములు నడచినవి. వానిలో సూర్యనారాయణశాస్త్రిగారు "గ్రంథవిస్తరభీతిచే రెండవ లక్షణమును విడిచితి" నన్న జబాబుతో నూరకుండిన వివాదమే లేక పోయెడిది గాని తనతప్పు వెదకినవానితప్పు దా మరల వెదకినం గాని సమానస్కంధుఁడం గా నని కాంబోలు "ప్రియు నభిసరింపఁజేయునది కూడ నభిసారిక" యని సదాశివశాస్త్రిగారు చెప్పిన ద్వితీయపాదాభిప్రాయము నాక్షేపించుచుఁ దదర్థము కాంతునిగూర్చి దూతిక నభిసరింపఁజేయునది గాని యన్యము గా దని విలిఖించిరి. ఇందుమీద సంస్థానపండితులవిద్వత్తయుఁ బట్టుదలయు నట్లుండ సంస్థానప్రభువులు కూడ రసికులును సత్యనిర్ధారణకై పాటుపడువారును నగుట నిది ప్రబలుచచ్చుటకు హేతువై విమర్శనగ్రంథమే బయలు వెడలవలసి వచ్చెను. ఈ యుభయవాదములును సాంతముగఁ జదివినవారికి ద్వితీయపాదమునకుఁ బ్రియు నభిసరింపఁజేయునది కూడ నభిసారిక యనునదియే వాస్తవార్థ మని తోఁచి తీరును.

గ్రంథవిస్తరభీతి యైనను యత్కించి దభిప్రాయని వేదకులకుఁ దగును గాని గ్రంథ మాంధ్రీకరింపనే పూనినవారికిఁ దగినపని కాదు. ఈపట్టున సూర్యనారాయణశాస్త్రిగా రెత్తికొనినపద్యము తేటగీతి. అందుఁ బూర్వార్ధముతోఁ బూర్వార్ధము దెనిఁగించిరి. ఉత్తరార్ధముతో నుత్తరార్ధము దెనిఁగించిన నాపద్యమున కెక్కువయందమే వచ్చుచుండెను. అట్టిచో మఱియెందుకు వదలిరో తెలియఁబడదు. ఎందుకేని వదలనిండు. దానికి గ్రంథవిస్తరభీతిచే ననిమాత్రము ప్రత్యుత్తరము చాలియుండ ననవసర మగువాదముఁ బెంచుకొని తమగ్రంథమును విమర్శింపఁదగినస్థితిలోనికిఁ దీసికొనివచ్చిరి.

(2) మూలము. "వ్రీడేర్ష్యా రాగద్వేషప్రసంగతః" వ్యా॥ సత్పురుషాణాంచ లజ్జా ఇతరేషాం త్వసూయానురాగాపహాశేచ్ఛా

దయః ప్రసజ్యేరన్” దీనికి సూర్యనారాయణశాస్త్రిగారియాంధ్రీకరణము “సత్పురుషు లగువారికి లజ్జాసూయాదులు గూడ జనించును” అని. ఈయాంధ్రీకరణము సరిగా నున్నది లేనిది యత్కించిత్సంస్కృతభాషాజ్ఞానము గలవారికే సుబోధము, కావునఁ దదాక్షేపప్రకటన మనవసరము. స్థాలీపులాకన్యాయమున నీరెండువిషయములు కనఁబఱచితిఁ గాని యిందు సదాశివశాస్త్రిగారు చూపినదోషము లన్నియు సరియైన వనుటకు సంశయము లేదు” అని.

శ్రీయుత జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. యెల్. డిప్టికలెక్టరు గారి యభిప్రాయము.—

తాము వ్రాసినజాబు చేరినది. ఆంధ్రదశరూపకవిషయ మయి మీకును బ్ర, మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారికిని జరిగిన వాదప్రతివాదములు గలపత్రిక తా మంపినది నేను చంద్రగిరిలో నుండఁగా నందినది. అభిసారికాలక్షణమును గూర్చి సూర్యనారాయణశాస్త్రులగారిమతము నిశ్చయముగాఁ దెలియఁగోరి యాయన పేర వ్రాసినాఁడను. ఆయనకు నాకు నుత్తరప్రత్యుత్తరములు జరుగుచుండఁగనే కొందఱి పండితులయభిప్రాయములు మీరు ప్రకటించుటయు వాని నాయన ఖండించుటయు జరిగినది. ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవమునకై కడపకు వెళ్ళినపు డిదంతయు నాకుఁ దెలిసినది. ఇది యవతారిక.

అభిసారికాలక్షణమును గూర్చి నాయభిప్రాయ మేమి యనఁగా, స్థూలదృష్టితోఁ జూచినపుడు “సారయే ద్వా” యను మూలవాక్యమునకు దూతీప్రేషణ మర్థ మని తోఁపవచ్చు ననుటకు సందేహము లేదు. ఉదాహరణపద్యమందు దూతీప్రేషణమాత్రమే వక్కాణింపఁబడినది. కావున నాపద్య మీయన్వయమున కనుకూలముగనే కనఁబడును. కాని యిటీవలిలాక్షణికు లందఱును బూర్వోదాహృతవాక్య

మునకు నాయకుని రప్పించికొనుటయే యర్థము చెప్పి యుండిరి గను కను, దూతిని బంపుటచేతనే కామార్తురా లగునాయిక చరితార్థురాలు కానేరదు కావునను, "సారయే" త్తనఁగాఁ గాంతుని రప్పించుకొనుట యనియే యర్థ మని చెప్పవలసియున్నది. ఉదాహరణశ్లోక మీయన్వ యమును బాధింపదు.

ఈ నాయభిప్రాయము సూ-శాస్త్రిలుగా రెఱుఁగుదురు. వారి ఖండనపత్రములో నాయభిప్రాయమునందలిపూర్వభాగమునే యుదా హరించుట, తాము చేసినయర్థమునకుఁ గూడ నవకాశము లేకపో లే దని తెలుపుటకై యని యూహించెద. మీపత్రికలోనియితరవిషయ ములనే విమర్శించి యుండలేదు. కావున వానినిగూర్చి నాయభిప్రా యము ప్రస్తుతము తెలుపఁజాలను. పండితాభిప్రాయములు గలపత్రిక ప్రతియొకటి పంపఁగోరెద.

అనంతపురం గవర్నమెంటుకాలేజీ సంస్కృతపండితు లగు శ్రీసము ద్రాల వేంకటఅప్పలాచార్యులవారి యభిప్రాయము.—

అనంతపురము. 23-7-1917.

తాము దయతో నంపిన యాంధ్రదశరూపకవిమర్శము నా కందినది. చాల సంతసించితిని. సమగ్రముగఁ జూచితిని. ఆంధ్రదశ రూపకమునుగూడ సంవాదార్థ మాయాయిస్థలములఁ జూచి యుంటిని.

"శ్లో. కామార్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" అను ధనంజయోక్తాభిసారికాలక్షణ మందలి ద్వితీయభాగమునకు, కాంతపద ముభయాన్వయి యగుటవలన "కాంతుని నభిసరింపఁజేయు నది కూడ నభిసారిక" యనియే యర్థము. ప్రతాపరుద్రీయములోని "కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా" అను కారికకు

వ్యాఖ్యానముఁ జేయునప్పుడు కుమారస్వామిసోమపీథి "అభిసారికా మాహ, కాన్తేతి, కాన్తస్య కర్మణః కర్తు ర్వాభిసరణే ఉద్యుక్తా, అత ఏవో క్తమ్, స్మరా ర్తాభిసరే త్కాంతం సారయే ద్వాభిసారికా" ఇతి (ద-రూ-ప్ర ౨. శ్లో ౨౭) "సారయే దితి, దూత్యాదిముఖే నేతి శేషః" అని రత్నాపణమున వ్రాసి యున్నాఁడు. దీనింబట్టి యాలోచింప, కాంతకర్మకాభిసరణకర్తృత్వము, కాంతకర్తృకాభిసరణానుకూలవ్యాపారకర్తృత్వమును, నాయికానిష్ఠధర్మము లని స్పష్టముగఁ దెలియుచున్నది. దూత్యాదుల కభిసరణక్రియోపాయత్వము శాస్త్రసమ్మతము గాని తత్కర్తృత్వ మట్లు గాదు. నాయకనిష్ఠాభిసరణక్రియాకర్తృత్వము నాయికానిష్ఠాభిసారికాత్వవ్యపదేశప్రయోజక మగుటకు రసపోషకత్వమే బీజ మని యలంకారశాస్త్రమర్మజ్ఞు లయిన విద్వజ్జనులకు విదిత మయినయంశము.

మరియు క్షీరస్వామి, అమరకోశములోని "కాన్తార్థినీతు యా యాతి సంకేతం సాభిసారికా" అనుశ్లోకమునకు వ్యాఖ్య వ్రాయు సందర్భమున "య ద్భరతః — శ్లో. హిత్వా లజ్జాభయే శ్లిష్టా మద నేన మదేనచ । అభిసారయతే కాన్తం సాభవే దభిసారికా॥ ఇత్యాల న్త్యోయ మభిసారికాశబ్దః. వాసకసజ్జా, విరహోత్కంఠితా, ఖండితా, విప్రలబ్ధా, కలహాన్తరితా, తథా ప్రోషితభర్తృకా, స్వాధీనపతి కేత్యన్యా స్సప్తా న్వర్థత్వా న్నదర్శితాః" అని భరతోక్తిని బ్రమాణముగ నుదాహరించెను. ఇంతియకాక సాహిత్యదర్పణమున విశ్వనాథ కవిరాజు "అభిసారయతే కాన్తం యామన్మథవశం వదా । స్వయం వాభిసర త్యేషా ధీరై రుక్తాభిసారికా" (సా- ద- తృ- ప- శ్లో ౭౬) క్రమాద్యథా.

నచ మేవ గచ్ఛతి యథా లఘుతాం కరుణాం యథాచ కురుతే సమయి । నిపుణం తథైన మభిగమ్యవదే రభిదూతి కాచి దితి సందిదిశే.

"ఉత్క్షిప్తం కరకంకణద్వయ మిదం బద్ధా దృఢ మ్మేఖలా, యత్నేన ప్రతిపాదితా ముఖరయో ర్మంజీరయో ర్మూకతా। ఆరబ్ధే రభసా న్మయా ప్రియసఖి క్రీడాభిసారోత్సవే, చండాల స్తిమిరావగుంఠనపటక్షేపం విధత్తే విధుః" అని "అభిసారయతే కాన్తం యామన్మథవశం వదా" అనెడి స్వోక్తాభిసారికాలక్షణప్రథమభాగమునకు లక్ష్యముగ ధనికోదాహృత మయిన "నచ మేవ గచ్ఛతి యథా లఘుతా" మిత్యాదిశ్లోకమునే ఉదాహరించినాఁడు. సాహిత్యదర్పణటీకాకర్త శ్రీ రామచరణతర్కవాగీశభట్టాచార్యులు "అభిసారికాపదస్య, వ్యుత్పత్తిలభ్య మర్థద్వయం లక్షణద్వయ మాహ, అభిసారయత ఇతి, నచేతి, సః కాంతః, అభిదూతి, అభిముఖాగతాం దూతీం ప్రతి, సందిదిశే, వాచికం న్యస్తవతీ" అని టీక వ్రాసియుండెను. తా ముదాహరించిన రసమంజరీ సింగభూపాలీయాద్యలంకారగ్రంథములనే గాక సాహిత్యదర్పణా ద్యన్యాలంకారనిబంధనములను గూడ పరిశీలింప, కాంతపదమున కుభయాన్వయిత్వము దూత్యాదుల కభిసరణక్రియాసాధనత్వమును సర్వాలంకారికసమ్మత మని దృఢముగ నిర్ణయింపవలసి యున్నది. "కాంతం సారయేత్" అనువాక్యమునకు కాంతునిగూర్చి దూతి నభిసరింపఁజేయునది యని యర్థము చెప్పుట అలంకారశాస్త్రవిరుద్ధము. అష్టవిధనాయికానిరూపణప్రస్తావమున దశరూపకమునందె, "స్వయ మగమనా న్నాయకం ప్రత్యప్రయోజకత్వా న్నాభిసారికాత్వమ్" అని వ్రాయఁబడి యుండుటవలన, స్వయంగమనము నాయకాగమనప్రయోజకత్వము అను నీరెండే అభిసారికాత్వప్రయోజకములు. దూతీప్రయోజకత్వము అభిసారికాత్వవ్యపదేశప్రయోజకము కానేరదు. అట్లయినచో వినిగమనాభావమువలవ సాధనత్వేనాభిమతము లయిన శుకపికకపోతాదివివిధసాధనప్రయోజకత్వములకు తుల్యన్యాయమునుబట్టి విభిన్నలక్షణత్వ మేర్పడ లక్షణానంత్యము తటస్థించుట యనివార్యము. మఱియు ననాకాంక్షిత మయిన దూతీ

శబ్దమున కధ్యాహారలభ్యత్వకల్పనమును సరిగాదు. దూత్యాదుల కభి సారికాలక్షణకుక్షిప్రవేశము చెప్పుట యలంకారశాస్త్రవిగర్హితము. కాంతున కభిసరణక్రియాకర్తృత్వకర్మత్వములు సర్వాలంకారికసమ్మతములు గాన అభిసారికాశబ్దవ్యుత్పత్తిబలలభ్య మయినయర్థద్వయమును లక్షణద్వయముగ నంగీకరించుటయే సమీచీనము. అనాకాంక్షిత దూతీపదాధ్యాహార మనుచితము. ఇదిగాక అభిపూర్వకసృధాతువు సంభోగప్రయోజనకగమనార్థకము గాని, కేవలగత్యర్థకము కాదు గావున "అభిసారయేత్" అనుదానికి "పంపునది" అని యర్థమును జెప్పి సవరణము చేయుటయు గూడ నసమంజసము. ధాత్వర్థనిర్వచనపరిపాటీవిరుద్ధ మనియు నాతాత్పర్యము. అధికముగ వ్రాయ నేల? అభిసారికాలక్షణవిమర్శప్రస్తావమున, తాము వ్రాసినయుక్తు లన్నియు ప్రమాణానుగతములు సర్వాత్మనాయుక్తము లని నాయభిప్రాయము.

(2) "నానుకార్యస్య వృత్తత్వాత్" ఇత్యాదిస్థలములయందు అనుకార్యపదము దశరథాపత్యబోధకమే కాని అనుకర్త లయిన (రామాదివేషధారి) నటులను బోధించునది కాదు. అనుకార్యులు రామాదు లనియు అనుకర్తలు నటు లనియు సుప్రసిద్ధ మయినయంశము. మరియు "యది చానుకార్యస్య రామాదే శ్శృంగార స్స్యాత్" ఇత్యాదిస్థలములయందు అనుకార్యులు రామాదు లని మూలముననె స్పష్టముగ వ్రాయఁబడి యుండ అనుకార్యానుకర్తల కభేదమును గల్పించి వ్రాయుట మిక్కిలి యన్యాయ్య మయినవిషయము. ఆస్థలములో తాము వ్రాసినహేతువులు సర్వథా అభినందనీయములు.

(3) "ఆసన్నాయత్త రమణా హృష్టా స్వాధీనవల్లభా" అను స్వాధీనపతికాలక్షణఘటక మయిన "ఆసన్న" పదమునకు "నచ వాసకసజ్జాదేః స్వాధీనపతికాదా వంతర్భావః అనాసన్నపతికత్వా

ద్వ్యాసకపజ్జాయా న స్వాధీనపతికాత్వమ్" అను వాక్యమువలన వా
సకసజ్జాతివ్యాప్తి వారకముగ సార్థక్యమును విశదీకరించి యుండ
నాంధ్రీకర్తలు స్వాధీనపతికాలక్షణశరీరములో వ్యావర్తక మయిన
యాసన్నపదమును పరిత్యజించుట మిక్కిలి యనుచితము. లక్షణము
నకు వ్యావృత్తియే ముఖ్యఫల మని విద్వాంసు లెఱింగి యున్నవిష
యమే కదా!

విమర్శమున సర్వాంశములను తామే సయుక్తికముగను సప్ర
మాణముగను చర్చించి యుంటిరి. నేనపూర్వముగ వ్రాయునది లేదు.
కొన్ని నాకుఁ దోఁచినమాటలను దిఙ్మాత్రముగ వ్రాసియుంటిని. రస
విషయమునఁ గొంత వ్రాయవలసి యున్నను నా కవకాశము చాల
నందున వ్రాయఁజాల కుంటిని. తమవిమర్శము శాస్త్రానుగత మయి
సర్వాత్మనాయుక్తముగ నున్న దని నాయభిప్రాయము. ఇం కొకటి.
ఇక్కాలమున కొందఱు విమర్శ మనియో మ రేమియో పేరుఁ బెట్టి
విషయమును శోధింపక, యేమేమో అసభ్యముగను అప్రామాణిక
ముగను అసందర్భముగను వ్రాయుచు తమకు స్వభావసిద్ధ మయిన
పరశ్రేయోసహిష్ణుత్వము, ఆత్మస్తుతి, పరతిరస్కృతి మొదలయిన
గుణసంపదను తమంతకు తామే లోకమునకు వెల్లడి చేసికొను చుం
డుట యెల్లరకు ననుభవసిద్ధము కదా! తా మేతత్కాలికవిమర్శకుల
లో నొక్క రయి యుండినను భవత్కర్తృక మయిన యీవిమర్శ
గ్రంథము ఆత్మస్తుతిపరనిందాదిపూర్వోదాహృతలక్షణస్వరూపనిరూ
పణమాత్రపర్యవసన్నము గాక విషయశోధనమాత్రవిశ్రాంత మగు
టచే సర్వవిద్వజ్జనసమాదరణీయ మయి యుండు నని వ్రాయుటకు
చాల సంతసించుచున్నాను.

"శ్లో. తేజస్వినో హి కార్యేణ దర్శయంతి స్వవిక్రమమ్।
తాదృశాః కత్థనం వ్యర్థం కుర్వతే ఖర్వతేజసః" అనురీతిని కార్య
ముఖమున తమవిద్యావైదుష్యములను ప్రపంచమునకు వెల్లడి చేయుట

రే వాస్తవిక మైన విద్వత్స్వరూపము న్యాయ్య మయినపద్ధతియునై యున్నది కదా! చిత్తగింపవలయును.

22-7-1917.
అనంతపురము.

సముద్రాల వేంకటఅప్పలాచార్యులు,
సంస్కృతపండితుఁడు, గవర్నమెంటుకాలేజి.
అనంతపురము.

మద్రాసుపచ్చయప్పకాలేజీ సంస్కృతవిద్యాప్రథమోపాధ్యాయు లగు
శ్రీ శ్వేతారణ్య నారాయణయజ్వగారి యభిప్రాయము.—

శ్లో. ఆంధ్రదశరూపకోపరి కర్ణాట శాలాస్థపండితప్రవరైః
ప్రోక్తాః కేచన దోషాః విద్యంతే ఽన్యే ప్యసంఖ్యాతాః.
తా న్వివరీతుం నైవా స్త్యవకాశో మే త్రయ్యాక్రిమోత్కస్య
శ్వేతారణ్యాభిజన శ్రీమ న్నారాయణాధ్వరీంద్రస్య.
స ఏవ దోషాన్ పరిశీల్య సర్వాన్
యయా కయాచి ద్విధయా స్వకీయామ్
నిర్దోషలేశాం రచయే త్కృతిం చే
ల్లోకోపకారం జనయే దదభ్రమ్.

ఇత్థమ్,
శ్వేతారణ్యనారాయణయజ్వా,
చెన్నపత్తనవిరాజమాన పచ్చయప్పపాఠశాలా
సంస్కృతవిద్యాప్రథమోపాధ్యాయః.

శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిలవారి యభిప్రాయము.—

ఆర్యవర్యా! మీరు దయాపూర్వకముగ నాకుఁ బంపించిన "ఆంధ్రదశరూపకవిమర్శము" అనుగ్రంథముఁ జదివి మీయాక్షేపణము లన్నియు యుక్తియుక్తము లని గ్రహించి కృతజ్ఞతతో జాబొకటి వ్రాసి పంపవలయు నని తలంచునంతలో శ్రీ శ్రీ గునుపాటి యానాది

రెడ్డిగారు వ్రాసి ప్రకటించిన "మల్లాది పిల్లకవియల్లరి" అను పేరుగల పుస్తకము నాకగపడినది. పిమ్మట మీరు వ్రాసిన "ఖండనాభాస నిరాసమును, పండితాభిప్రాయమ్ములును" జూడఁ గలిగితిని. "గోళ్ళఁ బోవుదానికి గొడ్డళ్ళేమిటి" కన్నట్లు మల్లాదివానిపుస్తకముపై నింత యేమిటి కని యూహింపవలసినవాఁడ నైతిని. అక్కటా! మల్లాది సూర్యనారాయణశాస్త్రి నిన్నగాక మొన్నఁ గన్నులు తెఱచిన పిన్న వాఁడు కాని ఆఱితేరినవాఁడు మహాపండితుఁడును గాఁడు. అతఁడు నాకు దగ్గర బంధువులలోనివాఁడు. అతనిపై నింత వింతలు కత్తులు దూయుట న్యాయము కాదు. అతఁడు కొంచెము సంస్కృతాంధ్రసాహిత్యము కలవాఁడే కాని లేనివాఁడు కాఁడు. అతఁడు మొదట వ్రాసినవిదురనీతి యనుపుస్తకమును సంస్కరించి నాప్రెస్సులో ముద్రించితిని. అతనికవిత్వ మంత సాధువు కాకున్నను ఉత్తరరామచరిత్రము లోనగు కొన్నిగ్రంథములు రచియించి యున్నవాఁడు. ఉత్తరరామ చరిత్రము సరియైన యాంధ్రీకరణము కానిమాటయే నిజము. కుతూహలమునం జేసి దశరూపకముఁ దెలిఁగించినాఁడు. అది మహాపండితులు తెలిఁగింపవలసినగ్రంథము. దానిలోఁ దప్పులు పడిన వనుటలో సందియ పడవలసినది లవమైనను లేదు. మీవిమర్శములోఁ జూపిన వన్నియును దప్పులే కాని యొప్పు లన నొప్పదు. మఱియునుం గొన్ని తప్పు లాఘ్యాంధ్రదశరూపకమునం జూపట్టు చున్నవి.

అవి యన్నియును ద్వితీయముద్రణమునందు సవరించుకొనుననని నాయభిప్రాయము. కావున నింక మీ రీవిషయమును విడిచి మా సూర్యనారాయణ విశేషజ్ఞుఁ డగుఁ గావుత మని యాశీర్వదించుచుందురు గావుత మని విన్నవించు చున్నాఁడను. చిత్తగించవలెను.

11-4-1918.
రాజమహేంద్రవరము.

విధేయుఁడు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

వేంకటగిరిసంస్థానపండితు లగు వేంకటసుబ్బాశాస్త్రులుగారి ద్వితీయ వారాభిప్రాయము.—

"మీరు వైశాఖశుద్ధ ౨ వ్రాయించినజాబు చేరి సంగతులు తెలియనాయను. అభిసారికాలక్షణము ప్రతాపరుద్రీయమునందు సాహిత్యరత్నాకరమందును రెండువిధములు గలదిగా చెప్పఁబడ లేదు. వ్యాఖ్యానమందు యోజన చేశి యున్నారు. రసమంజరీ రసార్ణవసుధాకరము మొదలైన గ్రంథములలో చెప్పియుండు ప్రకారముగా యోజన చేశి యున్నారు. మీరున్ను వ్రాశ్ని ఉపపత్తులు వాట్లను అనుసరించే యున్నవి. అయితే దశరూపకకారుడు చెప్పినలక్షణము న్కున్ను వ్యాఖ్యానమందు ఉదహరించ్ని శ్లోకమున్కున్ను బట్టిచూస్తే నేరుగా కాంతు నభిసరించునాయిక అభిసరింపబోవు చున్ననాయిక అని ద్వివిధముగా అభిప్రాయము స్వారస్యముగా యున్నట్టు తోచుచున్నది. కాంతు నభిసరింపజేయు చున్న దని వ్యాఖ్యాతకు తాత్పర్యముంటే నాయకుణ్ణి దూతిద్వారా తనగృహమున్కు రావించిన దని తాత్పర్యము గల శ్లోకమును ఉదహరించవలను. అట్లా ఉదహరించ లేదు. గన్క దశరూపకకారునికి అభిసరించుచుండేది, అభిసరింపఁ బోవునది, అనియే తాత్పర్యముగా తోచుచున్నది. ప్రతాపరుద్రీయాదిగ్రంథములయందు ప్రోషితభర్తృక అను నాయిక వకతె చెప్పఁబడి యున్నను రసమంజర్యాదిగ్రంథములలో ప్రవత్స్యత్పతిక, ప్రోషితభర్తృక, అని భేదములు చెప్పి యున్నట్టు, అభిసారికలో గూడా అభిసరింపబోవుచున్న దనియుకూడా చెప్పవచ్చును గదా! మరియు ప్రతాపరుద్రీయములోకూడా "కాంతాభిసరణోద్యుక్తా" అని చెప్పఁబడి యున్నది. ప్రతాపరుద్రీయము దశరూపకగ్రంథమును బట్టి చెప్పబడినది అనుటకు సందేహము లేదు. అచ్చటచ్చట "ఏషా దశరూపకోక్త ప్రక్రియా" అని చెప్పబడి యున్నది. కాంతాభిసరణోద్యుక్తా అనుపదమున్కు అభిసరించునది తదుద్యోగము గలది అని అర్థము

చెప్పుట స్వారస్యముగా యున్నది. లేనియెడల సాహిత్యరత్నాకర మందు చెప్పినట్టుగానె "అనురక్తా స్వయం యాతి కాంతం యా సాభి సారికా" అని చెప్పి వుంచును. గనుక ప్రతాపరుద్రీయముకూడా దశ రూపకకారాభిప్రాయమును అనుసరించుచున్నట్టు స్పష్టముగా తెలియ బడు చున్నది. ఇది గాక "నచ మేవ గచ్ఛతి యథా లఘుతాం" అను శ్లోకము మల్లినాథసూరిగారు కలహాంతరితపరముగా చెప్పి యు న్నారు. కలహాంతరిత, కోపముచే ప్రియుణ్ణి నిరాకరించి పిమ్మట పశ్చా త్తాపమును బొంది తానే ప్రియునివద్దికి దూతిని పంపునది. యీపద్య ములో "నచ మేవ గచ్ఛతి యథా లఘుతాం" అనివాదములో లఘుత్వకారణము తానె దూతిని పంపుటయే గాని వేరే కాదు. అల్లానే, అభిసారికాపరములో తానె ప్రియునివద్దికి పోవుట లఘుత్వ కారణ మని అవశ్యం చెప్పవలను. గనుక అభిసరింపబోవు నుద్యోగిం చిన నాయిక ముందుగా నాయకాభిప్రాయమును తెలుసుకొన వల నని దూతిని పంపిన దని చెప్పవలను. ఇద్దరికి స్వయంగమనం కలదు. రెండవదానికి విలంబగమనం—యీలాటిచర్చలు మొదలైనవి శ్రీ శ్రీ శ్రీ పెద్దరాజాగారిసముఖమునందు జరిగినవి. అందుమీాద శ్రీవారుకూడా యీఅభిప్రాయం బాగా యున్న దని శలవిచ్చినారు. దాన్నిబట్టి నేను వ్రాశినాను.

(౨) రసవిషయములో రసము నటనిష్ఠము అని గ్రంథకారుని యభిప్రాయ మని నేను చెప్పినట్టు సూర్యనారాయణశాస్త్రులవారు వ్రాయడం పొరబాటు. ఇచ్చట యేమి జరిగినది అనగా నేనే సూర్య నారాయణశాస్త్రులవారిని అడిగితిని. దశరూపక వ్యాఖ్యానమును చూడగా రసము నటనిష్ఠము అని మీారు వ్రాసినట్టుగా తోచుచున్నది. దానికి అట్లా అభిప్రాయము వుండదు. సదాశివశాస్త్రులవారు మొద లైనవారు వచ్చినప్పుడు చక్కగా చర్చ జరిగితే దాని అర్థము స్పష్ట ముగా తెలుసును అని చెప్పినాను. ఇదివరకు సదరుగ్రంథమును చక్కగా నేను చర్చ చేయ లేదు.

(3) స్వాధీనపతికాలక్షణములో మీరు వ్రాశ్ని దోషములు దోషములు కావని నేను చెప్ప లేదు. ఇవి అసమాధేయదోషములు కావు. యేదో విధముగా సమాధేయము లని చెప్పినాను. ఇంతేకాని వేరే కాదు.

చె. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

## —[*] నిగమనము. [*]—

ఇటులు పండితాభిప్రాయము లేఁబదియా అగుచున్నవి. వీని లోఁ గొన్ని యనేకులు పండితులు చేరి యిచ్చినవి కావున వారిల లెక్కించినచో నభిప్రాయప్రదాతలు డెబ్బదిముగ్గు రగుచున్నారు. ఎందఱైనను వీరలలో, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు శ్రీ ప్రభువర్యులసన్నిధికి వ్రాసికొన్నప్రకారము, పదుగురుపండితులు పక్షపాతశూన్యులు నాంధ్రదేశమునఁ బ్రసిద్ధులు నగువార లుండక పోరు. తమ కోరికప్రకారము పదుగురియభిప్రాయములే కాక, పె క్కండ్రయభిప్రాయములు "సూర్యనారాయణశాస్త్రిగారి దశరూప కాంగ్రీకరణము, తన్నిర్వాహార్థమై చేయువాదము, సమంజసములు కా" వని యైకకంఠ్యముతో వక్కాణించుచుండ నాశాస్త్రిగారుకూడ నంగీకరింపక తప్ప దని తోఁచెడిని.

ఒకవేళ వేంకటగిరి వేంకటసుబ్బాశాస్త్రిగారి ద్వితీయపత్రికాభి ప్రాయము స్వమతానుకూల మని సూర్యనారాయణశాస్త్రిగారు తలం తురేమో కాని యది ఘటిల్లదు. ఆపత్రికలో రసము నటనిష్ఠ మను టను గూర్చియు, స్వాధీనపతికాలక్షణము వాసకసజ్జయం దతివ్యాప్త మనుటను గూర్చియు, వ్రాయఁబడినవిషయములు సూర్యనారాయణ శాస్త్రిగారి కనుకూలములు గా వనుట తెల్లము గదా! ద్వితీయాభి సారికను గూర్చి వ్రాయఁబడినదిగూడ ననుకూలము గాదు. "దూతి

వంపునది ద్వితీయాభిసారిక" యని నుడివెడు సూర్యనారాయణశాస్త్రి గారికి "అభిసరింపఁబోవునది ద్వితీయాభిసారిక" యని స్వయంగంత్రి కభిసారికాత్వము చెప్పెడు వేంకటసుబ్బాశాస్త్రిగారిలక్షణ మెట్లు లనుకూల మగును?

ఇది గాక యీలక్షణము వీరి పూర్వపత్రికాభిప్రాయమునకు విరుద్ధ మగుట వ్యాహతం బగుచున్నది. అయ్యది పైపండితాభిప్రాయముల సంవాదమునను, అలంకారశాస్త్రానుగ్రహమునను, బలవత్తరము గాన వినిగమనావిరహప్రసక్తి లేదు.

వేంకటసుబ్బాశాస్త్రిగారు "దశరూపకమును, తద్వ్యాఖ్యను బట్టి చూస్తే అభిసరించుచున్నది అభిసరింపఁబోవునది, అని చెప్పుటే స్వారస్య" మని వ్రాసిరి. కాని యది మూలవ్యాఖ్యలయభిప్రాయముల కత్యంత విరుద్ధము. కనుఁడు "స్వయ మగమనా న్నాయకం ప్రత్యప్రయోజకత్వా న్నాభిసారికా త్వమ్" అని లిఖించిన వ్యాఖ్యాత "నాయకాభిసరణప్రయోజిక ద్వితీయాభిసారిక" అని నుడువుచున్నాఁడు. "అభిసరింపఁబోవునది" యని స్వయంగంత్రికే ఆయభిసారికాత్వమును జెప్పెడు శాస్త్రిగారి కీవ్యాఖ్యాభిప్రాయము ప్రతికూలమే కదా! ఇటులు మూలాభిప్రాయము గూడ. దశరూపకమును బట్టి ప్రతాపరుద్రీయము వ్రాయఁబడిన దని వీ రీపత్రికలో వ్రాసిరి. ఆప్రతాపరుద్రీయములోని "కాంతాభిసరణో ద్యుక్తా" అనెడు లక్షణమును వివరించునపుడు కుమారస్వామి సోమయాజిగారు "కాంతస్య కర్మణః కర్తు ర్వా" అని వ్రాసి, తదుపష్టంభముగా నీదశరూపకోక్తాభిసారికాలక్షణమునే వ్రాసిరి. దీని ననుసరించి ద్వితీయాభిసారికాలక్షణమును వ్రాసిన రసమంజరీసాహిత్యదర్పణాదిగ్రంథకర్తలు గూడ నిటులే వ్రాసిరి. కావున "సారయేత్" అను దశరూపకలక్షణమునకు "కాంతకర్తృకాభిసరణప్రయోజిక యభిసారిక" యనియే తాత్పర్య మనుట తెల్లము. అటు లగునపు డీమూలలక్షణము, "అభిస

రింపఁబోవునది" యని స్వయంగంత్రి కభిసారికాత్వము చెప్పెడు వేంకట సుబ్బాశాస్త్రిగారికి విరుద్ధ మనుట నిర్వివాదాంశము.

వాస్తవమున దశరూపకమునకు శాస్త్రిగారు చేసిన యర్థ ముపపన్నంబే కాదు. వారు "సారయేత్" అను ణిజంతమునకు "అభిసరింపఁబోవు చున్నది" అని యర్థము వ్రాసిరి. అది ణిజంతము నకుఁ దగిన్నయర్థము గాదు. "స్వతంత్రః కర్తా, తత్ప్రయోజకో హేతుశ్చ" అని యుండుటవలన స్వతంత్రకర్తృప్రేరకునకే హేతుకర్తృత్వము సిద్ధ మగుచున్నది. ఇది వ్యుత్పత్తివాదద్వితీయకారకమున "హేతుమతిచే త్యనుశాసనా ణ్ణిజర్థో హేతుకర్తృత్వమ్. తచ్చ స్వతంత్రకర్తృప్రేరణా అన్యనిష్ఠ కర్తృత్వ నిర్వాహక వ్యాపారరూపా" అని గదాధరభట్టాచార్యులచే వివరింపఁబడినది. శాస్త్రులవారియర్థ మున నొకనాయికయే స్వతంత్రకర్త్రియు హేతుకర్త్రియు నగుచున్నది. ఇందువలన నన్యనిష్ఠ కర్తృత్వ నిర్వాహక వ్యాపారవత్త్వరూపహేతు కర్తృత్వము నాయికకు సిద్ధింపదు. అపుడు "సారయేత్" అని ణిజంతప్రయోగ ముపపన్నము గాదు.

ఒకవేళ, శాస్త్రిగారు "అభిసరింపఁబోవు నుద్యోగించిన నాయిక ముందుగా నాయకాభిప్రాయము తెలుసుకోవల నని దూతిని పంపిన దని అవశ్యం చెప్పవలను" అని వ్రాయుచున్నారు కాఁబట్టి నాయిక యందు దూతీగమనమునకుఁ బ్రయోజకత్వము, స్వయంగమనమునకు స్వతంత్రకర్తృత్వము నిరాబాధము, దూతి స్వాన్యయే కదా! అని యందు రేమో, అది సరి గాదు. స్వతంత్రకర్తృప్రయోజకత్వము వివక్షితము. దూతి యభిసరణస్వతంత్రకర్త్రి గాదు. మ రేమన్న, వీరి మతమున నాయికయే. అది స్వాన్య గాదు. కావున స్వతంత్రకర్తృ ప్రేరకత్వరూపహేతుకర్తృత్వము నాయికకు సిద్ధింపదు. కావున శాస్త్రిగారు చెప్పినయర్థ ముపపన్నంబే కా దనుట తెల్లము.

ఇఁక " కాంతు నభిసరింపఁ జేయునది, అని వ్యాఖ్యాతకు తా త్పర్య ముంటే నాయకుణ్ణి దూతీద్వారా తనగృహమున్కు రావించిన దని తాత్పర్యము గల శ్లోకము నుదహరించును. అట్లా ఉదహరించ లేదు. గన్క దశరూపక కారునికి అభిసరించుచున్నది అభిసరింపబోవు నది అనియే తాత్పర్య " మని శాస్త్రులుగారు తాము చేసినయర్థము దశరూపక కారాభిమత మయినటులు నిరూపించి యున్నారు గదా! అని యందురు. అది కాదు. వ్యాఖ్యానమును బట్టి గదా మూలమునకు వా రాయర్థము చేసిరి. " నాయకం ప్రత్యప్రయోజకత్వాత్ " అని లిఖించినవ్యాఖ్యాతకు " అభిసరింపబోవునది " అనులక్షణ మభిమతము గా దని నిరూపింపఁబడియె. అందు వలన వ్యాఖ్యనుబట్టి శాస్త్రిగారు మూలమునకు స్వాభిప్రేత మగు నభిప్రాయము నూహించుట పొసం గదు. " సారయేత్ " అని లక్షణము చేసిన మూలకారున కిది యభి మతమే కా దనికూడ నిరూపింపఁబడియెను.

ఇదిగాక నాయకుఁడు తనయిల్లు చేరినపిదప నాయిక యభిసా రికయే కాదు. అభిసారిక విప్రలంభశృంగారాలంబననాయికలలోఁ జేరునది. దానికి దశరూపకమున చింతా నిశ్వాసఖేదాశ్రు వైవర్ణ్య గ్లాన్యభూషణములు గుణములు చెప్పఁబడినవి. ప్రియసమాగమ మహా భాగ్యశాలిని యగు నాయిక కివి యుండవు. మరి యేమనిన, క్రీడా జ్వల్యప్రహర్షితాదు లుండును. అది సంభోగశృంగారాలంబనయై స్వా ధీనపతిక నాఁబరఁగు. కావున శాస్త్రిగా రట్టి యుదాహరణము కావ లయు నని కోరుట తగదు.

ఇది గాక, నాయిక సంకేత దేశసంయోగానుకూలవ్యాపారవతి యైనపుడు ప్రథమాభిసారికయు, నాయకుని దత్సంయోగానుకూలవ్యా పారవంతుని జేయ నుద్యోగించుచున్నపుడు ద్వితీయాభిసారికయు నగు చున్నది. అనఁగా నభిసరణాభిసారణాన్యతరవ్యాపారము నాయిక యందు వర్తమాన మైనపుడె యభిసారిక యగుచున్నది. " అభిసరతి

అభిసారయతి వా అభిసారికా" అను విగ్రహవాక్యముగూడ నీయర్థ మునె చాటుచున్నది. ఇట్టిచో, నాయకుఁడు తనయిల్లుఁ జేరఁనపిడప నాయిక యభిసారిక యెటు లగును? సర్వజ్ఞుం డగు ధనికపండితుం డట్టి దాని కభిసారికాత్వ మెటు లంగీకరించును? వ్యాకరణవిరామోత్తర మట్టిప్రయోగ మగుచో గ్రామసంయోగోత్తరముకూడ "గ్రామం గచ్ఛతి" యని ప్రయోగము కలుగవలసి వచ్చును. కావున శాస్త్రి గారు నాయకుని తనయిల్లు జేర్చినది యభిసారిక యని భావించుట పొరపాటు.

ఇదిగాక సాహిత్యదర్పణమున ద్వితీయాభిసారికకు "అభిసారయతే కాంతం యా మన్మథవశం వదా" అని లక్షణము చెప్పి దానికి లక్ష్యముగా "నచ మేవ గచ్ఛతి" అను ప్రకృతశ్లోకము నుదాహరించినందున నది నాయకాభిసారణపరమే కాని నాయికాస్వయంగమన పరము గా దని స్పష్ట మగుచుండినను, ఆ యభిప్రాయమునే ధనికుండు "నాయకం ప్రత్యప్రయోజకత్వాత్" అనుటచే బోధించి యుండినను, వానిని గటాక్షింపక శాస్త్రులుగారు "నచ మే" అను శ్లోకమును స్వయంగంత్రీపరముగా నయించి "ఇద్దరికి స్వయంగమనం కలదు. రెండవదానికి విలంబగమనం" అని సిద్ధాంతము చేయుట చిత్రము.

ఇదిగాక •వీ రిచట వ్యాఖ్యాభిప్రాయమునే ముఖ్యముగా నెత్తికొని తదనుగుణముగ మూలమును నయించి ప్రతాపరుద్రీయాభిసారికాలక్షణమందు వ్యాఖ్యాభిప్రాయమును నిరాకరించి మూలమున కన్యార్థము చేయుట తగదు. "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిః" అను న్యాయ ముభయత్ర సమానము. వ్యాఖ్యాతలయభియుక్తత్వముగూడ నవిశిష్టము. ఇంతియ కాదు. ప్రతాపరుద్రీయవ్యాఖ్యానము సర్వాలంకారగ్రంథసంవాదసమలంకృతము. స్వోత్ప్రేక్షిత దశరూపకవ్యాఖ్యాభిప్రాయము తద్విపరీతము. నిరుక్తరీతిని వ్యాఖ్యాకృ దనభిమతము మూలానభిమతంబును.

ఇంక, "కాంతాభిసరణోద్యుక్తా" అనెడి ప్రతాపరుద్రీయలక్షణమునకు "కాంతుని నభిసరించునది, తదుద్యోగము గలది" అనియే తాత్పర్యము గాని రత్నాపణవ్యాఖ్యాలిఖిత మగు "కాంతస్య కర్మణః కర్తృత్వా" అని కాదు, అయ్యది రసమంజర్యాద్యనుగుణము కాని మూలానుగుణము గాదు, కావున రత్నాపణవ్యాఖ్యానము నిరాకరింపఁబడెమె, అందు రేమో. అది సరి గాదు. కృదంత మగు నభిసరణశబ్దముయోగమున "కర్తృకర్మణోః కృతి" అనుసూత్రముచేఁ గర్తృకర్మార్థములయందు షష్ఠియు, కాంత స్యాభిసరణమ్" అని విగ్రహమును, శాస్త్రసమ్మతము లగుట తెల్లము. కావున రత్నాపణము శాస్త్రీయం బగుట సూపపన్నంబై ఇతరాలంకారికసంవాదమహితంబై మూలానుగుణం బగుచున్నది.

"అభిసరించినది అభిసరింపఁబోవునది" అనెడి శాస్త్రిగారివ్యాఖ్యానమే తద్విపరీతం బగుట నత్యంత హేయంబు. కనుఁడు. తన్మతమున "కాంతాభిసరణోద్యుక్తా" అనెడి మూలములో "కాంతాభిసరణ" అనునది యొకలక్షణము, "ఉద్యుక్తా" అనునది యొకలక్షణము కావలయు. రెంటికి విశేషణోభయపదకర్మధారయము. కాంతాభిసరణపదము కాంతునిగూర్చి యభిసరించునది యనునర్థమును, ఉద్యుక్తాపదము కాంతాభిసరణోద్యోగము కలది అను నర్థమును బోధింపవలయు. అభిసరణపద మభిసరణక్రియావత్పరము. వారు తెచ్చిపెట్టుకొన్నతత్పదము పూర్వనిర్దిష్ట మగు కాంతాభిసరణపరామర్శక మనవలయు. కాంతాభిసరణపదము ప్రథమలక్షణమున ధర్మిపరము స్త్రీలింగమును, ద్వితీయలక్షణమున ధర్మపరము నపుంసకమును అని యంగీకరింపవలయు. ఈయర్థము విద్యానాథునకు దశరూపమునకు నభిమత మఁట. "స్వరూపవ్యాక్రియైవ పరాక్రియా" అను న్యాయము ననుసరించి యింతియ చాలు నని దీని యసాంగత్యము వివరింప నొల్లను. ఇట్టి యపూర్వార్థము మూలానుగుణమో,

తత్పాపణ్ణప్రదర్శితార్థము మూలానుగుణమో, పండితులు పరిశీలిం
తురు గాక.

శాస్త్రులుగారు తుదిని "ఈలాటిచర్చలు మొదలైనవి శ్రీ శ్రీ శ్రీ
పెద్దరాజాగారిసముఖమునందు జరిగినవి. అందుమీఁద శ్రీవారుకూడా
యీయభిప్రాయం బాగా యున్న దని శెలవిచ్చినారు. దాన్ని బట్టి
నేను వ్రాసినాను" అని నిరుక్తార్థమంతయుఁ దమది కానటులు తెల్చిరి.
ఇది వాస్తవ మని తలంప రాదు.

వీ రింకొకజాబులో: "అప్పుడు జరిగినచర్చలో శ్రీవారికి దశ
రూపకకారునియొక్క అభిప్రాయము స్వయముగా అభిసరణ చేయునది
దూతిని పంపునదియు నభిసారిక యని ధనికోదాహృతఉదాహరణము
వల్ల తోచుచున్న దని శెల విచ్చి యుండిరి" అని వ్రాసియున్నారు.
ఇటులు పరస్పరవిరుద్ధము లైన యభిప్రాయములు శ్రీవారు సెల విచ్చి
యుందు రనుట సంభావనీయము కాదు. ఇది గాక శ్రీమహారాజుగారు
ప్రకృతవిషయములో తి. నారాయణదాసుగారిద్వారమున నా కనుగ్ర
హించినపత్రికలో "మీరు వ్రాసినయుత్తరములు చేరినవి. ఆయుత్త
రములను బ్రహ్మశ్రీ వేంకటసుబ్బాశాస్త్రిగారి చేతి కిచ్చి సంస్కృతదశ
రూపకాదులఁ దెప్పించి మీరును మల్లాదివారును వ్రాసినవిషయము
లను సాంతముగ శ్రీవారు చిత్తగించ్చి మీరు వ్రాసిన యాక్షేపములు
సంస్కృతగ్రంథానుసారముగ నున్న వనియు, మల్లాదివారు వ్రాసిన
సమాధానములు సమంజసములుగ నుండలే దనియు సెలవిచ్చిరి."
అని వ్రాయించిరి. అప్పటికే మల్లాదివారిసమాధానములు చాలవఱ
కభిసారికావిషయమున నే ప్రవర్తించి యుండినవి. అవి సమంజసములు
గా వని వ్రాయించిన పండితప్రభువులు తద్విరో గను బరస్పరవిరుద్ధ
ముగను నెప్పటికి సెలవిచ్చి యుండరు. వ భక్తపరాధీను
లయిన మనశాస్త్రిగారే అప్పటప్పటికిఁ నములు చేసి
వానియందు విశ్వాసమును సంపాదించు భిప్రాయమ

లంగాఁ జూపుచున్నారు. అవియు సుపపన్నంబులు గాక సికతాకూపంబులువోలెఁ దమంతనే కూలిపోవుచున్నయవి. ప్రయత్నశతముచే నిలిపినను "నహికస్యచి ద్గ్రంథకృతో విపరీతలేఖనం యుక్తిబలా ద్వస్తుసిద్ధా బాధకమ్" అను గదాధరవాక్యానుసారము దర్శితానేకపండితాభిప్రాయములకు నాలంకారికసిద్ధాంతములకు విపరీతము లగుటఁ బ్రకృతసిద్ధాంతప్రతికూలములు గాఁజాలవు. ఇటులు స్వేష్టసిద్ధి సమకూరినది. ఓం తత్సత్.

